

ఆగస్టు 1980 సంచికలో

అందించబడిన

పూర్తి నవల





# సూర్యమిత్ర

రచన: జొన్నలగడ్డ లలితాదేవి

అది కృష్ణానదీ తీరం. విజయవాడ పట్టణం. దుర్గగుడి ఘా
మీదుగా ఓ ఇంపాలాకారు గుడిదగ్గరకు వచ్చింది. కారులో
ఆరడుగుల పొడవు, పొడవుకు తగిన శరీరదార్ఢ్యం, విశాలమై
నుదురు, అందం—ఠీవి—ఆకర్షణ అన్నీ మూసటోసుకుని ఖరీదై
దుస్తుల్లో ఓ ముప్ఫయిలోపు యువకుడు. పల్చని చీరలో ఇంచుమిం
అదే వయసున్న ఓ అందాలభామ.

"మనం బయలదేరడానికి ఇంకా ఓ అరగంటన్నా టైముంది
ఈలోగా ఏం చేద్దామంటావు?" అని అడిగాడా యువకుడు.

"అరగంటేగా, ఓ మాటు దుర్గాదేవిని చూపిస్తే సరి."
జవాబిచ్చిందామె.

ఒక్కక్షణం ఆలోచించి "పద" అంటూ కారు ఓ పక్కగా
పార్క్‌చేసి ఆమెను తీసుకుని గుడి దగ్గరకు వచ్చాడు.

గుడిదగ్గర ఏమంత యెక్కువగా లేరు జనం. ఒక్కనిమిషం
ఆ జనంమధ్య నిలబడ్డారిద్దరు. ఆ దేవి సరిగ్గా వారికి కనిపించిందో-
లేదోకూడా. దృష్టిమాత్రం వాచీమీదనుంచి మరలడంలేదు.

"ఇంకరా హేమా" అంటూ చకచక కారుదగ్గరకి నడిచాడు.
అనుసరించింది హేమలత.

భూపాల్ కారు తిన్నగా వచ్చిన రోడ్డంబడే క్రిందికి దిగింది.
అప్పటికి బాగా చీకటి పడిపోయింది. కృష్ణాబ్యారేజ్‌మీద వెలిగిన
లైట్ల కాంతి నీళ్ళలో ప్రతిఫలిస్తోంది. చల్లనిగాలి, నదిమీదనుంచి
మరింత చల్లదనం నింపుకుని చల్లగా శరీరాన్ని స్పృశించిపోతోంది.
కొండమీదనుంచి కారు మెలికలు తిరుగుతూ దిగుతుంటే నల్లని
కొండలమధ్య హోరుమనే కృష్ణానది ఏదో సంగీతంలా వినిపిస్తోంది.

భూపాల్ కారు డ్రయివ్ చేయడంమీదే దృష్టి కేంద్రీకరిం
చాడు. కాని పక్కనే తనని తాకుతున్నట్టు కూర్చున్న హేమలతతో
ఒక్కచిన్న మాట మాట్లాడటం లేదు. ఆమెకూడా పరిసరాలలో
లీనమైనట్టు కనిపిస్తోందే తప్ప అతనికేసి చూడటంలేదు.

కారు తిన్నగా ఓ తోటముందు చిన్న జర్కుతో ఆగిం
అందులోంచి దిగాడు భూపాల్. అనుసరించింది హేమలత.

ఆ తోట దగ్గర ఓ చిన్న ఔట్‌హౌస్‌లో నవారు మంచంమీద కూర్చుని తీరుబడిగా చుట్ట తాగుతూ భార్యతో కబుర్లాడుతున్న తోట మాలి భీమసింగ్ కారునుచూసి చుట్ట కిందపెట్టి ఒగ్గునలేచాడు. చూస్తూనే భూపాల్‌ని గుర్తించి "రండిబాబూ" అంటూ సంతోషంగా ఆహ్వానించాడు.

కారు లోపలికితెచ్చి చెట్లమధ్య వుంచి తిన్నగా తోటలోని ప ఇంట్లోకి దారితీశాడు భూపాల్. ఈలోగా భీమసింగ్ పరుగు లాంటి నడకతో వెళ్ళి తలుపు తెరచి లైట్లు ఆన్‌చేసాడు.

క్రింద నాలుగు—పైన మూడుగదులున్న చిన్నమేడ అది. భూపాల్ తిన్నగా మేడమీదకు వెళ్ళి కోటు-టై విప్పి అక్కడే వున్న టేబుల్‌మీద పడేశాడు. పక్కనే కూర్చుంది హేమలత.

గబగబా కాఫీ కప్పులు తీసుకుని భూపాల్ దగ్గరకు వచ్చాడు భీమసింగ్. ఇద్దరికీ చెరొక కప్పు అందిస్తూ పరీక్షగా ఆమెకేసి చూశాడు. హేమలత అంతవరకూ చుట్టుకున్న పిగ విప్పి జుట్టు ఫ్రీగా వదిలింది. నల్లగా నిగనిగలాడే శిరోజాలు వీపంతా పరచుకుని ఆమెకి వింత అందాన్నిస్తున్నాయి. విశాలంగా వుండే ఆమెకళ్ళు నీలాల్లా మెరిసిపోతున్నాయి. అందం—అందాన్ని మించిన అవయవ సౌష్టవంతో నిండుగా వుంది. ఆమెను చూస్తూంటే ఏ గొప్పయింటి అమ్మాయిలాగానో కనిపిస్తుంది కాని సామాన్య స్త్రీలా కనిపించదు.

"లక్ష్మీ! వంటబాగా చెయ్యి. అయ్యగారికి, ఆ అమ్మాయి గారికీని. ఏకాస్త పొరపాటు వచ్చినా వూరుకోను" అంటూ హెచ్చరించాడు భీమసింగ్.

భీమసింగ్ నిజం చెప్పవలసి వస్తే మంచి కుటుంబంలోని వాడే. అతనికి యుద్ధం అంటే తగనికాంక్ష. అందుకే ఈతని గోల భరించలేక నీ యిష్టం వచ్చినట్టు యేడవమని వదిలేశారు తల్లి దండ్రులు. వారికంత విసుగు పుట్టింది. భీమసింగ్ మిలిటరీలో చేరి ట్రెయినింగ్ అయ్యాడు. ఏ యుద్ధంలో పాల్గొన్నాడో-ఏమయ్యాడో మళ్ళీ వారికి అజ లేకుండాపోయింది. చైనా యుద్ధంలో పాల్గొన్నాడు-

పాకిస్తాన్ యిద్ధంలోనూ పాల్గొన్నాడు. చివరకి ప్రభుత్వమువారిచ్చిన పన్నీ పుచ్చుకుని హైద్రాబాద్ వచ్చాడు.

అక్కడ ఉద్యోగాలు చేయబోయినా, ఇతని యుద్ధప్రియత్వం వల్ల జగడాలమారిగా మారిపోయాడు. ఏకాస్త పొరపాటుగా యెవరు మాట్లాడినా ఛర్రున లేచేవాడు. వీలయితే కొట్టి మరీ మాట్లాడేవాడు. ఆ కారణంగా అతనెక్కడా ఓ నెలకూడా పూర్తిగా ఉద్యోగంచేం లేక పోయాడు.

అలా వున్నప్పుడు ఉద్యోగంచేస్తూ, దండుకున్నప్పుడుతింటు రోజులు నెట్టుకు వస్తున్న అతను హైదరాబాద్‌లోని ప్రముఖ పారిశ్రామికవేత్త రాజావరప్రసాద్ కంటబడ్డాడు. అదే అతని జీవితానికో టర్నింగ్ పాయింట్. ఇతన్ని, ఇతని ఆవేశాన్ని, దురుసు స్వభావాన్ని క్షణంలో పసిగట్టిన రాజావరప్రసాదరావు తన దగ్గర వేసుకున్నాడు చాలా దీర్ఘంగా ఆలోచించే।

అతనికంటే రెండాకులు ఎక్కువ చదివాడు అతని పుత్రరత్నం భూపాల్. తండ్రి దగ్గర్నుంచీ అతన్ని తన చెప్పుచేతలకింద వుంచుకుంటూ విజయవాడలోని వారి తోటకు సంరక్షకుడుగా అట్టి పెట్టాడు. తోటమాలిగదా అని అతను తోటపనులేం చేయడు. తోటకి నీళ్ళు పెట్టడానికి, వూడ్చి శుభ్రం చేయడానికి ధర్మన్న అనే ఓ వ్యక్తి వున్నాడు. ఆ తోటలోని చిన్న మేడకు కాపలాదారు— భూపాల్‌చేసే మంతనాలకి అదే రహస్య స్థావరం. అందులో తప్పకుండా భీమసింగ్ వుంటాడు. అతనితో సంప్రదించకుండా అక్కడికి వస్తే భూపాల్ ఏ పనీ చేయడు.

గబగబా టేబుల్స్, కుర్చీలు అన్నీ గుడ్డతో తుడిచి అల్మారాలోంచి కొన్ని కొవ్వొవత్తులు—అగ్గిపెట్టె టేబుల్‌మీద పెట్టాడు. ఉన్నట్టుండి పుటుక్కున కరెంట్ పోతూవుండటం పరిపాటి అయిపోయింది కనుక.

"కొవ్వొవత్తులు దేనికి భీమ్?" అని అడిగాడు భూపాల్ ఆశ్చర్యంగా.

"అయ్యా! ఈమధ్య చిటుకూచిటుకూ కరెంట్ పోతోంది.

తిరిగి రావడానికి అరగంట—గంటకూడా పట్టవచ్చు. అందుకే ముందు ఇవన్నీ పెట్టుకుంటే కంగారుండదు" అంటూ వినయంగా సమాధానం ఇచ్చాడు. అతని స్వామిభక్తికి చాలా ఆనందించాడు భూపాల్. అయితే భీమసింగ్ ప్రభుభక్తి వెనక కావలసినంత స్వార్థ చింతన వుంది. ఈ విధంగా ప్రతి పనిలోనూ భూపాల్‌కి అత్యంత వినయ విధేయతలుగా వుంటే ఈమేడ తోట తనకే రాపిస్తాడని— కనీసం ఓ లక్షరూపాయల క్యాష్ అన్నా ముట్టచెబుతాడని. బిజినెస్‌లో భాగం అన్నా కోరవచ్చని ఇలాగే రకరకాల నిచ్చెనలూ వేసుకుంటు న్నాడు ఆకాశానికి.

"మీ భోజనాలకి ఏర్పాటు చేస్తున్నాను. ఇంకా యీలోగా మీకేమన్నా కావాలా?" అని అతివినయంగా అడిగాడు.

"మా కిప్పుడింకేమీ అక్కర్లేదు. రేపు ఉదయం మద్రాసుకు బయలుదేరాలి. అసలు హైదరాబాద్‌నుంచి రావడం కూడా ఇప్పుడే! ఏకబిగిన కారుప్రయాణం చేయలేక ఈ పూట ఇక్కడ ఆగిపోయాము. పైగా కారులో పెట్రోలుకూడ తక్కువగా వుందని అనుమానం వచ్చింది. రేపుదయం యే బంకులోనయినా ఫుల్‌గా పట్టించుకువచ్చా వంటే మేము సుఖంగా మద్రాసు చేరుకుంటాం" అన్నాడు భూపాల్ సిగరెట్ ముట్టించి గుప్పున పొగవదలుతూ.

అలాగేనన్నట్టు తలవూపి క్రిందకు వచ్చాడు. లక్ష్మి ఆ తోట లోపే వో పక్కగా వున్న వంగమడుల్లోంచి కాయలుకోసి అప్పటి కప్పుడు కూర వండింది. ఇంట్లో కాసిని బంగాళాదుంపలు వుంటే వేయించింది. కాస్త పులహోర కలిపింది. పాలపొడి టిన్ను ఉపయో గించి పాలతో పాయసం తయారుచేసింది. ఇలాగే తన సూక్ష్మబుద్ధి ప్రయోగించి అన్నీ చకచకా చేసింది.

ఈలోగా క్రింద లోపలిగదిలో వున్న అల్మారా తాళంతీసి ఖరీ దయిన విస్కీ బాటిల్, గ్లాసులు తీసుకువచ్చి పైనపెట్టాడు భీమ్. తనే చకచకా వెళ్ళి కిళ్ళీ కొట్టుదగ్గర సోడాలు, అక్కడేవున్న చక్ర కేళీలు తీసుకువచ్చాడు.

వంట పూర్తిచేసిన లక్ష్మి చకచకా చీర మార్చుకుని, బొట్టూ

కాటుకా దిద్దుకుని, ఆ మేడలో లోపల గదిలో వున్న స్టీల్ బీరువా తెరచి వెండి కంచాలో రెండుతీసి పైన వారి డైనింగు టేబుల్‌మీద పెట్టింది. అక్కడ ఇద్దరూ వడ్డించారు. మళ్ళీ ఏమన్నా కావాలంటే వేయడానికి భూపాల్ పక్కన భీమ్ హేమలత పక్కన లక్ష్మి నిల బడ్డారు.

భోజనం చేస్తున్న ఆమెనే పరిశీలనగా చూసింది లక్ష్మి. ఆమె మెడలో మంగళసూత్రం, నల్లపూసలూ వున్నాయి. భూపాల్ కింకా పెళ్ళికాలేదు కనుక ఆమె అతగాడి భార్యకాదు! అయితే యెవరు? ఎవరయినా కావచ్చు. రసికాగ్రేసర చక్రవర్తి అనదగిన భూపాల్ వలలో పడిన వివాహిత స్త్రీ కావచ్చు. మరెవరయినా కావచ్చు.

పుష్కలంగా డబ్బు, దానికి తగినట్టు అందం అన్నీ వున్న శృంగార పురుషుడు భూపాల్! అతనికి అమ్మాయిలను వలలో వేసు కోవడంలో వున్నంత నేర్పు మరెవరికీ వుండదు.

వ్యాపారంలో చాణిక్యునిలాంటి తెలివి ఉపయోగిస్తాడు. ఆడ పిల్లల దగ్గర అపర శ్రీకృష్ణునిలా చెప్పినమాట చెప్పకుండా, వున్న చోట వుండకుండా ప్రేమసిమాత్రం వర్షంలా కురిపిస్తాడు. ఈనాడు బృందావనంలో వుంటే రేపు రేపల్లెలో వుంటాడు. మరోరోజు మధురానగరంలో మకాం పెడతాడు. అవన్నీ లీలామానుష విగ్రహు డయిన అతనికే తప్ప మరో నరాధముడికి, ఆఖరికి కన్నతండ్రికి కూడా తెలియదు. మదిర, మదవతులంటే అతనికెంత ప్రాణమో, వ్యాపారం అన్నాకూడా అంతే కనుకనే ధనార్జనకి, చేసే బిజినెస్‌కి ఏమీ ధోకాలేకుండా పోయింది.

భోజనాలు పూర్తి అయ్యాయి. వంట చాలా బాగుందని మెచ్చుకున్నారు భూపాల్, హేమలత కూడా! ఆ మాటలు వింటూ పొంగిపోయింది లక్ష్మి.

వారిద్దరి మెప్పు పొందిన లక్ష్మిని అభిమానంగా చూశాడు భీమసింగ్. జేబులోంచి పర్సుతీసి పదిరూపాయల నోట్లు రెండు లక్ష్మికిచ్చి "ఏమన్నా కొనుక్కో! ఇంక నువ్వు వెళ్ళవచ్చు" అంటూ సోఫామీద వాలిపోయాడు భూపాల్.

లక్ష్మి సంతోషంగా వెళ్ళిపోయింది క్రిందికి. మిగిలిన వంట కాలన్నీ కడుపుపట్టినంత వరకూ ఆరగించి హాయిగా నిద్రపోయింది.

"హేమా! నువ్వు కాసేపలా విశ్రమించు" అంటూ భీమ సింగ్‌ని చూపి కనుసంజ్ఞ చేశాడు.

అది గ్రహించి భీమసింగ్ గబగబా క్రిందికి దిగిపోయి లోపల వున్న సీక్రెట్ రూం తలుపు తెరిచి సిద్ధంగా వున్నాడతని రాకకోసం.

భూపాల్ మెల్లగా క్రిందికి దిగివచ్చాడు. అతన్ని చూపి కాస్త తొలగి నిలబడ్డాడు భీమసింగ్.

"తలుపు గడియ వెయ్యి భీమ్!" అన్నాడు భూపాల్ కుర్చీలో కూర్చుంటూ. వేసివచ్చాడు. "అదిగో ఆ కుర్చీలో కూర్చో!" అంటూ తన ఎదురుగ్గా వున్న కుర్చీ చూపించాడు. అలాంటి సమయాల్లో భీమసింగ్ సేవకుడు కాదు: ఆంతరంగిక మిత్రుడిలా వుంటాడు.

"భీమసింగ్! మద్రాసులోవున్న మన భవనం అమ్మేస్తున్నాను" అన్నాడు ఉపోద్ఘాతంగా.

"దేనికి బాబూ!" అన్నాడు ఆశ్చర్యంగా.

"ఆ మధ్య మన భవనంలో పెట్టిన ఆఫీసులో అగ్నిప్రమాదం సంభవించింది. అప్పట్నించీ దాన్ని అమ్మిపారేయాలనుకుంటున్నాను. దానికి సంబంధించిన రాతకోతలు ఇక్కడ ఈ భవంతిలోనే జరుగు తాయి. అఫిషియల్‌గా అమ్మిన రేటు కొన్ని కాగితాలమీద వుంటుంది. అదికాక బ్లాక్‌మనీ క్రిందవచ్చేది కొంతవుంది" అంటూ ఆగాడు.

"రేటు యెంత చెబుతున్నారు బాబూ."

"రెండులక్షల యాభై వేలు. అయితే రెండు లక్షలవరకే మనం గవర్నమెంటుకు చూపిస్తాం. మిగిలిన యాభై వేలకి రసీదు లుండవు-రిజిస్ట్రేషన్ గొడవుండదు. ఆ యాభై వేలూ ముందు దాచాలి. అది బ్యాంకులో సాధ్యపడదు. ఇప్పటికే మనం చాలా టాక్స్ కడ తున్నాం."

"అవునవును. కష్టపడి సంపాదించుకున్నా కడుపునిండా తిన నీయరు. ఆ టాక్సులనీ, ఈ టాక్సులనీ మన దుంప తెంపుతున్నారు" అంటూ సానుభూతి చూపించాడు భీమసింగ్.

"అందుకే మరి. ఆ గొడవలు తగ్గించుకోవాలనేచ" అంటూ ఆలోచనలో పడిపోయాడు.

భవనానికి అగ్నిప్రమాదం అంటూ పెద్దగాలేదు అసలు. అది సంభవించిన గదికి తప్ప. కాని అది సాకుగా ఫైర్ ఇన్సూరెన్స్ నించి పెద్దమొత్తం లాగాలన్న కోరిక చాలా గాఢంగా వుంది. అది కుదరని పక్షంలో అమ్మకంలూ లాగాలని వుంది. తనకి జరిగిన నష్టానికి పరిహారం చెల్లించాలి ఇన్సూరెన్స్ వారు. అది అతని కోరిక. ఈ సందర్భంలో ప్రమాదం పెద్దగా లేదని నష్టం ఎక్కువ లేదని, తమ అభిప్రాయాలు వెలిబుచ్చిన ఇద్దరు మేనేజర్లని దొంగ కేసులు బనాయించి జైల్లో పెట్టించాడు వరప్రసాదరావు. వాళ్ళవల్ల తనకి చాలా చాలా ప్రమాదమని భావించి. అది చూసి హడలిపోయిన పిల్లిఉద్యోగులు ఆ కాస్త జీవనాధారమూ పోతే కుటుంబాలు గడవడం దుర్భరమని వరప్రసాదరావు ఆడించినట్టే ఆడుతున్నారు. వారు చెప్పమన్నట్టే చెప్పారు. అపారమైన నష్టం అంటూ పత్రికల్లో వేయించారు. పేపర్లలో వేయించారు. ఆ విధంగా కావలసినంత పబ్లిసిటీ ఇచ్చారు. ప్రజలు దానికింకా కాస్త చిలవలూ పలవలూ కల్పించుకొని ప్రచారం సాగించడంలో నష్టం దాదాపు పదిలక్షల వరకూ పెరిగిపోయింది. ఇది ఇన్సూరెన్స్ వారి ఇన్వెస్టిగేషన్‌లోనే వుంది ఇంకా। ఇవన్నీ బుర్రలో గిరగిరా తిరుగుతున్నాయి భూపాల్‌కి. తండ్రి సగంచేసిన పని తను పూర్తిచేయాలి గదా।

"ఇంతకీ తమకి వ్యతిరేకంగా చెప్పిన ఆ మేనేజరుగాళ్ళకి యెన్ని సంవత్సరాలు శిక్ష పడవచ్చు బాబూ।" అని అడిగాడు భీమ సింగ్ కుతూహలంగా.

"ఏడేళ్ళకి తక్కువ పడదు శిక్ష" గర్వంగా మీసం మెలి వేశాడు భూపాల్.

"మరి వారి కుటుంబాలు?" అని అడగాలని నోటిదాకా వచ్చినా అడగలేకపోయాడు భీమసింగ్। అలాంటివి అడిగి అతని అభిమానం పోగొట్టుకునేంత తెలివితక్కువ వాడు కాదు భీమసింగ్.

శతకోటి లింగాల్లో బోడిలింగమని-లోకంలో తిండికి ఠికానా

లేని కుటుంబాలు చాలానే వున్నాయి. అందులో ఇది ఒకటి అవుతుంది. దానికి ప్రత్యేకించి సానుభూతి చూపించవలసిన పనేమిటి? దానివల్ల ఆ కుటుంబాల కడుపు నిండదు-అనవసరంగా తన యజమానికి కోపం తెప్పించడమేగాని. ఈ విధంగా ఆలోచించిన భీమసింగ్ మళ్ళీ ఆ మేనేజర్లమీద, వారి కుటుంబాలమీద జాలి అనే పదాన్ని మనస్సులోంచి నెట్టిపారేశాడు.

"ఇంతకీ మీ నాన్నగారు మద్రాసులో వున్నారా?"

"ఉండద్దా మరి! కేసు ఏడుస్తోందిగా - ఆ మేనేజర్లమీద. మనం కూడా మరి రమ్మన్నప్పుడల్లా కోర్టుకు పోతూవుండాలి. దీని మూలాన మరో కొంత ఖర్చు" అంటూ విసుగ్గా వెనక్కి వాలాడు భూపాల్!

"మీరు ముందు విశ్రాంతి తీసుకోండి బాబూ! మదరాసు నించి వస్తూ మళ్ళా ఇక్కడ దిగండి. మరిన్ని వివరంగా మాట్లాడుకోవచ్చు" అన్నాడు భీమసింగ్.

"అదీ నిజమే! నాన్నగార్ని మీటవుతే గదా వివరాలు. నువ్వన్నట్టు తిరుగుప్రయాణంలో వస్తానిక్కడికి. అప్పుడు మనం ఓ రూం ఏర్పాటు చేసుకుందాం ప్రణాళికకి" అంటూ లేచాడు భూపాల్.

అలాగేనన్నట్టు తల పంకించి క్రిందకి వెళ్ళిపోయాడు భీమసింగ్.

అతను పైకి వచ్చేసరికి హేమలత నిజంగానే నిద్రపోతోంది. బడలికగా తనూ మంచంమీద వాలాడు భూపాల్.

## 2

తెల్లవారేసరికి మబ్బులు దట్టంగా పట్టివున్నాయి. తెల్లవారి ఏడవుతున్నా అయిదు కూడా అవలేదన్నట్టే వుంది వాతావరణం.

"వర్షం వచ్చేట్టుంది సాబ్! ఎలా వెడతారు?" అని అడిగాడు భీమసింగ్.

"మరేం ఫర్వాలేదు భీమ్! దారిలోనే తగ్గిపోవచ్చు. ఒక ప్లాను ప్రకారం నేను బయలుదేరితే దానికి తిరుగుండదు. భూనభోం

తరాళాలు దద్దరిల్లినా సరే" అంటూ జవాబిచ్చాడు భూపాల్.

ఆ మాటలో అతిశయోక్తి ఏమీలేదు కనుక భీమసింగ్ మళ్ళీ మాట్లాడలేదు. అతను కోరినట్టే కారునిండా పెట్రోలు పోయించుకు వచ్చాడు. లక్ష్మి పూరీలు చేసి కాఫీ పెట్టింది. అవి తిని కాఫీ త్రాగాడు. భూపాల్ స్నానం చేయడానికి బద్ధకించినా హేమలత స్నానం చేసింది. జుట్టు బర్మాముడివేసి పొడుగుచేతులున్న జాకెట్, పెద్ద అంచులున్న ప్లెయిన్ కలర్ కాశ్మీర్‌సిల్కు చీరకట్టి అతి సుందరంగా తయారైంది. ఆమెని చూసి తృప్తిగా నిట్టూర్చాడు భూపాల్.

"ఇంక బయలుదేరుదామా?" అని అడిగాడు.

వెడదామన్నట్టు తల వూపింది. ఆకాశంకేసి దృష్టి నిలిపినా వర్షాన్ని గురించిన జంకు ఆమెకు లేదని ఆమె ముఖమే చెబుతోంది.

"వస్తాం భీమసింగ్ మళ్ళీ కలుద్దాం" అంటూ కారు స్టార్ట్ చేశాడు భూపాల్. కారు కనుమరుగయ్యేదాకా అక్కడే నిలబడి తర్వాత లోపలకి వెళ్ళిపోయాడు భీమసింగ్. ఆ మేడలో గదులన్నీ యధాప్రకారం తాళంవేసి వచ్చి మళ్ళీ పెళ్ళాంతో కబుర్లు చెబుతూ కూర్చున్నాడు.

అనుకున్నట్టుగానే మరో పావుగంటలో వర్షం ప్రారంభమయింది.

"వీళ్ళు ఎందాకా పోయారో! వాన అప్పుడే తగులుకుంది" అన్నాడు భీమసింగ్.

"సరే! వెనక్కి తిరిగివచ్చి ఈ పూటకి ఆగిపోయినా, బాగుండు" అంది లక్ష్మి.

"ఆయనా! అలా వచ్చేరకం గాదులే! ముందుకు దూసుకు పోవడమే తప్ప వెనక్కి తిరిగిచూడడం అనేదిలేదు" అని జవాబిచ్చాడు.

అలా ప్రారంభమైన వాన అంతకంతకూ పెద్దదయి కుండపోతగా కురుస్తుంటే కంగారుపడ్డాడు భీమసింగ్.

"ఓ గ్యాస్‌పొయ్యి కొనవయ్యా అంటే వినవుగదా! కిరస

నాయిలు అయిపోయింది. ఈ వానలో యెక్కడికి చావను" అన్న
గట్టిగా.

"గ్యాస్‌పోయ్యా! నీకుక్లాస్ బలిసిపోయిందే! లేకపోతే మన
గ్యాస్‌పొయ్యేవిటే! పెద్దపెద్ద ఉద్యోగస్తులకే అతీగతీ లేకపోతేను"
అన్నాడు భీమసింగ్.

"ఆ! ఆరి సంగతి మనకెందుకులే! ఇట్లాగే అర్ధరాత్రి అప
రాత్రి మీ అయ్యగారు దిగుతుంటాడు. వంట వంట అంటూ నను
వూదరగొడతావు. ఎలా ఏడవాలి?" అంటూ చిరచిరలాడింది లక్ష్మి

గంట గడిచినా వాన తగ్గే సూచనలు కనిపించకపోవడంతో
"ఇదేదో తుఫానులావుంది" అన్నాడు దిగులుగా భీమసింగ్.

అవునన్నట్టు తలవూపింది లక్ష్మి. తుఫానంటే కరెంటుండద
మూడ్రోంతులు. కరెంటు లేకపోతే కిరసనాయిలు దీపం పెట్టుకోవాలి
ఆ కిరసనాయిలు అయిపోయింది. ఎన్ని చిక్కులు తెచ్చిపెట
తున్నావురా దేవుడా? అనుకుంది లక్ష్మి. ఆమె బాధ ఆమెది. భీ
సింగ్ బాధ భీమసింగ్‌ది. ఏది జరకూడదనుకుంటూవుంటారో అ
జరగడం రివాజు. అలాగే కరెంటూ పోయింది. వానా తగ్గలేదు.

"ధర్మన్నని పంపి లీటరన్నా తెప్పించవయ్యా!" అం
చిరాగ్గా.

పాపం వాడు మాత్రం ఎలా పోతాడు అనబోయి ఇంట్లో
ఇబ్బంది గమనించి ధర్మన్నన్ని పంపాడు డబ్బులిచ్చి. ఓ ఫర్లాం
న్నర దూరం ఆ వానలో నడిచి ఓ రెండు లీటర్ల కిరసనాయి
పోయించుకుని చలికి గజగజ లాడుతూ తెచ్చి అందించాడు ధర్మన్న
అప్పటికి కాస్త మనస్సులు శాంతించాయి లక్ష్మి, భీమసింగ్‌లకి.

పన్నెండు గంటలయింది. నాలుగు మెతుకులు నోట్లో వే
కుని ఆలా మంచంమీద వాలాడు భీమసింగ్. వర్షం, ఈదరగాలి
వెచ్చగా దుప్పటి కప్పకుని పడుకుంది లక్ష్మి.

ఒంటి గంట అవుతూండగా "ఏమండీ!" అంటూ పిలిచి
ఓ కంఠానికి ఉలిక్కిపడి లేచాడు భీమసింగ్. ఎదురుగ్గా ఓ పుప్పం
ఏళ్ళ యువకుడు. పూర్తిగా తడిసి చలికి గజగజ వణికిపోతున్నాడ

ఖం చూస్తుంటే ఓ వారం క్రిందట భోజనం చేసిన వ్యక్తి లా
న్నాడు. అయినా ముఖం మాత్రం చాలా అందంగా వుంది.
డవు ఎత్తు అంతా భూపాల్‌లానే వున్నాడు. అధాటున చూస్తే
పాల్ అనుకున్నంత దగ్గర పోలికలున్నాయి అతనిలో.

"ఎవరయ్యా నువ్వు?...." అని అడిగాడు భీమసింగ్
తగా.

"నేను ఓ ఆఫీసు ఉద్యోగిని. పనిమీద ఈ వూరు వచ్చాను.
లాదూరం వెళ్ళాల్సి వుండగా వర్షంలో తడిసిపోయాను. ఇంక
ళ్ళలేనన్న భయంతో ఇక్కడే ఎక్కడైనా ఆగిపోదాం
నుకుంటూ ఈ తోట కనిపించగానే ఏదైనా వీలుండకపోదన్న
శతో ఇక్కడికి వచ్చాను. దయచేసి ఈ వర్షం తగ్గేవరకూ
క్కడే వుండనిస్తే మీకు చాలా కృతజ్ఞుడిని" అన్నాడు విన
యంగా.

వర్షం చూడబోతే జోరున ఆగకుండా కురుస్తోంది. మనిషి
డబోతే ఎంతో అందంగానే కాదు సౌమ్యంగా, యే మహర్షి
ంగవుడో కాషాయాంబరాలకి బదులు, పాంటు షర్టు ధరించి, జడలు
ట్టిన శిరోజాలకి బదులు క్రాఫ్ చేసుకుని యిక్కడికి వచ్చాడాన్నంత
ర్చస్సుతో, కళకళలాడిపోతోంది ముఖం. కాని మనిషి మాత్రం
పవాసాలతో చిక్కినట్లే వున్నాడు.

భీమసింగ్ ఒక్క క్షణం అతనికేసి చూసి "వుండండి"
న్నాడు.

ఆ కాస్తకి అతని మనస్సు ఎంత సంతోషించిందో స్పష్టంగా
గహించాక జాలివేసింది భీమసింగ్‌కి.

"కాస్త టీ కాచు లక్ష్మీ!" అన్నాడు భార్య లేవడం చూసి.

లక్ష్మి మెల్లగా లేచి టీ కలిపి అతనికి ఒక కప్పు అందిం
ంది. వేడి వేడి టీకి ముఖం వాచినవాడిలా చిటికలో త్రాగేశాడు
తను.

"మీ పేరు?" అని అడిగాడు భీమసింగ్.

"ఉత్తమ్. ఈ తోట యెవరిది?" అని అడిగాడు ఉత్తమ్.

అతని పూర్తిపేరు ఉత్తమచంద్ర.

"ఇది హైద్రాబాద్‌లో పెద్ద బిజినెస్‌మాన్ శ్రీ భూపాల్‌గారిది' అన్నాడు గర్వంగా భీమసింగ్.

ఆ మాట వింటూ అత నేదో ఆలోచనలో పడినట్లు కనిపించాడు.

"ఈ వర్షం తగ్గేలా లేదు" అన్నాడు విసుగ్గా తోట నిండుతున్న నీళ్ళని చూస్తూ.

"తుఫానేమో?"

"అవును. మద్రాసులో వాయుగుండం పడిందట" అన్నాడు ఉత్తమచంద్ర.

"అయితే అక్కడ మరీ ఎక్కువగా వుంటాయి గదూ!" ఆదుర్దాగా అడిగాడు భీమసింగ్.

"వుంటాయా ఏమిటి? ఉన్నాయి. మొన్న రాత్రినించి కాస్త కాస్త మొదలయి నిన్నంతా కురుస్తూనే వుంది ఇంతకు రెట్టింపుగా!" అని జవాబిచ్చాడు.

"అయితే మీరు మద్రాసునించి వచ్చారా?" అని అడిగాడు కుతూహలంగా.

"అవును, అక్కడ మా ఫ్రెండ్ పెళ్ళికి వెళ్ళి చిక్కుబడ్డాను. రైల్లో వస్తుంటే పెట్టెబేడా అన్నీ పోయాయి. అందుకే యిలా తడవాల్సి వచ్చింది. లేకపోతే నాకేం ఖర్మ?" అన్నాడు ఉత్తమచంద్ర.

"ఏ వూరు వెళ్ళాలి మీరు?"

"బందరు" అని ముభావంగా జవాబిచ్చాడు.

ఇంకేం అడగడానికి తోచలేదు భీమసింగ్‌కి. అతని మనస్సంతా బయట తుఫానులాగే భీభత్సంగా వుంది. అయ్యగారు—ఆ అమ్మగారూ తిన్నగా మద్రాసు చేరారో లేదో — ఇదే అతని ఆందోళన.

"రాత్రికి బంగళాలో పడుకుందామా? ఇక్కడ మరీ చలి ఎక్కువగా వుంది" అని అడిగింది లక్ష్మి.

"పడుకుందాంలే" అన్నాడు భీమసింగ్ నవ్వుతూ.

ఆ సాయంత్రం పూరీలు వండింది. అవే రెండు అతనికీ యిచ్చారు. అతను మొహమాటంగానే తీసుకున్నాడు.

బంగళా తలుపులు తెరచి "మీరలా గదిలో పడుకోండి" అంటూ భార్యామణిని తీసుకుని పక్క గదిలోకి వెళ్ళి తలుపులు వేసుకున్నాడు భీమ్.

తన ప్యాంటు, షర్టు ఆరబెట్టాడు భీమసింగ్ ఇచ్చిన లుంగీ కట్టుకుని. అవి ఇంకా ఆరనేలేదు. చాప పరచుకుని పడుకున్నాడు ఉత్తమచంద్ర.

లోపల్నించి సన్నగా మాటలు వినిపిస్తున్నాయి.

"ఇంతకీ భూపాల్‌గారితో నిన్న వచ్చిన ఆమె ఎవరంటావు?" అని అడిగింది లక్ష్మి.

"ఆయన కేమే! కో అంటే కోటిమంది. ఆవిడ మెడలో మంగళసూత్రాలున్నాయి. భూపాల్‌గారి కింకా పెళ్ళి కాలేదు కనుక ఆయన భార్యమటుకూ కాదు" అన్నాడు భీమసింగ్.

"ఆ మాట నాకు నిన్ననే తట్టిందిలే! ఇంతకీ నీ ఎరికలో అమ్మాయి యేమోనని అడిగాను" అంది లక్ష్మి.

"నా ఎరికలో అమ్మాయయితే నేను మాట్లాడనా! పలకరించనా?" అన్నాడు భీమసింగ్ నవ్వుతూ.

ఆ తర్వాత మాటలేవీ వినిపించలేదు ఉత్తమచంద్రకి.

భూపాల్! భూపాల్! భూపాల్! ఎక్కడ చూసినా అతని పేరే! అనుకున్నాడు మనసులో కసిగా.

ఆ రాత్రి అంతా అతను జాగరణే చేశాడు. పడుకున్న యే అరగంట నిద్రపోయాడోగాని, తెల్లవారింది. వర్షం కూడా తగ్గింది. లక్ష్మి భీమసింగ్ లేచేసరికి బట్టలు వేసుకున్నాడు.

వాళ్ళు లేవగానే "ఇంక వెడతానండీ! మీరు చేసిన సహాయానికి చాలా కృతజ్ఞుడిని" అన్నాడు చిరునవ్వు ముఖంతో.

భీమసింగ్ ఏదో అనేలోగా అతను వెళ్ళిపోయాడు కూడా, భీమసింగ్ లుంగీ అక్కడే వుంచి.

"ఆ లుంగి కాస్త ఉతికి ఆరేయమను ధర్మన్నని" అంటూ బయటికి వెళ్ళిపోయాడు భీమసింగ్. అతనికి పట్టుకున్నగొడవల్లా భూపాల్ తిన్నగా మద్రాసు చేరాడా లేదా అన్నది.

భూపాల్ కారు ప్రయాణంతోపాటే ఆ రోజు వాన కూడా పెద్దదవుతూ వచ్చింది. ఆ కారులో కూర్చున్న హేమలత ఒణికింది భయంతో-చివరకి వర్షంలో మద్రాసు చేరగలమాని.

అయినా భూపాల్ నిర్లక్ష్యంగా కారును పోనిస్తూనే వున్నాడు—

"భూపాల్ మనం మద్రాసు చేరగలమంటావా?" అని అడిగింది సంశయంగా.

"చేరగలం—అనుకున్న దానికన్న ఓ గంట ఆలస్యంగా!" నిబ్బరంగా జవాబిచ్చాడు భూపాల్, అద్దానికి పడిన వర్షం మాటి మాటికీ తుడుచుకుంటూ.

ఆకలి అనిపించి ఒంగోలులో కారు ఆపి భోజనం చేశారు. అక్కడినించి మళ్ళీ నెల్లూరు వచ్చేదాకా మౌనం. అక్కడ కాఫీ టిఫిన్ తీసుకుంటే యింక మద్రాసు చేరేదాకా ఏమీ లేదు. కడుపు మాడ్చుకుంటూ మద్రాసు చేరేసరికి అత నన్నట్టే గంట ఆలస్యమైంది.

"కారు డ్రైవింగ్‌లో మీకున్న ప్రావీణ్యం అంతా చూపించారు" అంది హేమలత నవ్వుతూ హోటల్లో గది బుక్ చేసి చేరుకున్నాక.

అందుకు సమాధానంగా చిన్న చిరునవ్వు విసిరాడు భూపాల్!

"నువ్విక్కడ వుండు. నాన్నగారికి ఫోన్‌చేసి వస్తాను" అంటూ క్రిందికి వచ్చాడు. నెంబర్ డయల్ చేసి తండ్రిని పిలిచాడు.

కొడుకు కంఠం వినగానే ప్రాణం లేచివచ్చింది—వరప్రసాద్‌కి.

"ఏం నాన్నా ఎలా వుంది గొడవ?" అని అడిగాడు.

"ఫోన్‌లో చెప్పడం పడదురా! మనం ఏకాంతంగా మాట్లాడుకోవలసిందే. నువ్వు మన యింటికి రా!" అంటూ ఫోన్

పెట్టేశాడు వరప్రసాద్.

"మన ఇల్లు" అంటే ఇటీవలగా వరప్రసాద్ కొన్న ఇల్లు. ఆ యింట్లో క్రింద భాగమంతా ఓ కంపెనీకి అద్దెకిచ్చారు. పైన తమ క్రిందే అట్టిపెట్టుకున్నా ఈ మధ్య ఈ గొడవలు వచ్చాక ఆ యింట్లో కంటే హోటల్లో దిగడమే మేలనుకున్నాడు భూపాల్. పైగా తనతో వుండేది గర్ల్‌ఫ్రెండ్స్. నేరుగా అక్కడికి తీసుకువెళ్ళే అవకాశం లేకనే అతనిలాంటిచోట్ల దిగుతుంటాడు.

అతను మద్రాసు చేరేవరకూ, చేరిన తర్వాత కూడా వర్షం కురుస్తూనే వుంది. కనుక ఓ పెగ్గు విస్కీ త్రాగి హేమలతతో జాలీగా గడపడమే మేలు అని భావించి ఆ పూటకి తండ్రి దగ్గరకి వెళ్ళడం మానేశాడు.

భోజనం తెప్పించాడు రూమ్‌కి. అక్కడే ఇద్దరూ భోజనాలు చేశాక తలుపులు బిడాయించుకుని హాయిగా పడుకున్నారు. బయట చల్లదనం—గదిలో వెచ్చదనం—ప్రక్కన పరువాల ప్రేయసి! అతని కింకేం కావాలి? ఆ రాత్రంతా బయట ప్రపంచంతో తమకేం సంబంధం లేక హాయిగా స్వర్గసౌఖ్యం అనుభవిస్తూ ఎప్పటికో నిద్ర పోయాడు భూపాల్.

తెల్లవారేసరికి వర్షం కూడా తగ్గిపోయింది. గబగబా లేచి దంతధావనాది కార్యక్రమాలు ముగించుకుని స్నానం చేసి హేమలతని జాగ్రత్తగా వుండమని హెచ్చరించి తను తండ్రి దగ్గరకు బయలు దేరాడు. అప్పటికి టైము ఎనిమిది గంటలయింది.

వరప్రసాద్ ఆందోళనగా అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు. కొడుకుని చూడగానే ఆయనకి పోయిన ప్రాణం తిరిగి వచ్చిన ట్లయింది.

"ఏరా రాత్రే వస్తావనుకున్నాను. రాలేదేం! అయినా ఎలా రాగలవులే వర్షంగా!" అంటూ ప్రశ్న, జవాబు తనే చెప్పాడు కంగారు కంగారుగా.

ఆ ధోరణి చూసి యేదో చిక్కు సమస్యే వచ్చింది అని వెంటనే గ్రహించాడు భూపాల్!

"ఏమిటి నాన్నా! ఆలా వున్నావు?...." అని అడిగాడు భూపాల్.

"ఏం చెప్పనురా భూపా! ఒకటి వదిల్తే ఒకటి ప్రాణానికి సంకటాలు చుట్టుకుంటున్నాయి. ఆ మేనేజరు వెధవ చంద్రిగాడు జైలునించి తప్పించుకుపోయాడట. ఇప్పుడే ఫోన్ చేశారు పోలీసు వాళ్ళు" అంటుంటే బాంబు పేలినట్టు అదిరిపడ్డాడు భూపాల్!

"ఆడపిల్లలా వుండే ఆ ఆడారి వెధవ జైలునించి ఎలా తప్పించుకున్నాడు? ఎప్పుడు తప్పించుకున్నాడు?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించాడు.

"అవన్నీ పోలీస్‌స్టేషన్‌కి వెడితే తప్ప తెలియవు. నువ్వు వచ్చావుగా. యిద్దరం కలిసి వెడదాం" అంటూ డ్రస్ చేసుకో సాగాడు.

భూపాల్ బుర్ర పని చేయడం ఒక్క నిముషం మానేసింది.

ఎలా పారిపోయాడు? అలా పారిపోతుంటే ఈ రక్షకభటు లంతా ఎలా చూస్తూ వూరుకున్నారా? పులిమీద పుట్రలాగా మళ్ళీ ఇదేం గోల? అనుకుంటూనే తండ్రితో స్టేషన్ చేరుకున్నాడు. అక్కడి వాతావరణం కూడా తమ మనస్సులలాగే అస్తవ్యస్తంగా వున్నట్టు తోచింది—ఖైదీ పారిపోతే ఎంత హడావుడిగా వుంటుందో అంత హడావుడిగానూ వుంది.

వరప్రసాద్‌ని, భూపాల్‌ని చూపి "రండి" అంటూ గదిలోకి తీసుకువెళ్ళాదు యస్. ఐ.

"ఏమిటి మా ఖైదీ పారిపోయాడట" అంటూ భూపాల్ ప్రశ్నించాడు.

"అదేనండీ గొడవ, మొన్న తుఫాను ప్రారంభం అయ్యాకే అతను తప్పించుకుపోయాడని మా వుద్దేశం. ఈ మద్రాసంతా వెతికిస్తున్నాము. ఎక్కడన్నా పట్టుబడక తప్పదు. ఈ తుఫానులో దమ్మిడీ లేకుండా అత నెక్కడికి పోతాడండీ!" అంటూ ధైర్యం చెప్పాడు యస్.ఐ.

"నిజమే ననుకోండి! అయినా స్థానికంగా వున్న అన్ని పేప

ర్లలోనూ మనం అతని ఫోటోతో సహా ప్రకటన వేస్తే యెవరైనా ఆచూకీ చెబుతారు గదూ!" అన్నాడు భూపాల్.

"అవును. ఆ ప్రయత్నంమీదే వున్నాం. అతని ఫోటో కావాలి గదా!"

"అతని యిల్లు సోదా చేయించండి. ఫోటో దొరక్కపోదు."

"అతని ఇల్లు అంటూ పెళ్ళామా, పిల్లలా! ఎవరూలేని ఒంటి బతుకు. అందుకే అతని విషయంలో తగని చిక్కులు ఏర్పడుతున్నాయి. ఒక్కోసారి అతని వాలకం చూస్తుంటే ఇతను నిజంగా యింత నేరం చేశాడా? అని ఆశ్చర్యం వేస్తుంది" అంటూ ఆగాడు యస్.ఐ.

అతని మాటలు వినేసరికి ముఖం ఎర్రబడింది భూపాల్‌కి. అయినా పేపరు తిరగేస్తున్నట్టు తల వంచుకుని కూర్చున్నాడు.

అంతకంటే ఎంక్వయిరీకి యేమీ లేక "వస్తామండి. మళ్ళీ సాయంత్రం కలుస్తాం" అని లేచాడు వరప్రసాద్. తండ్రిని అనుసరించాడు తనయుడు.

ఆ సాయంత్రం పేపర్లన్నింటిలో పారిపోయిన నేరస్తుని ఫోటో వివరాలు ప్రచురించారు. అతని జాడ తెలిసినవారికి బహుమతి కూడా ప్రకటించారు. ఇంతకీ ఆ పారిపోయిన వ్యక్తి పేరు ఉత్తమ చంద్ర! అతను చేసిన నేరం—అగ్ని ప్రమాదాన్ని గురించి నిజం చెప్పడం, అందుకుగానూ అతనిమీద ఆరోపించబడిన నేరం వరప్రసాద్‌మీద హత్యాప్రయత్నం చేశాడని, పదివేల రూపాయల ఆఫీసు డబ్బు కైంకర్యం చేశాడని అది అడిగి తిట్టినందుకు వరప్రసాద్‌మీద కత్తి విసిరినట్లు చెప్పి జైల్లో పెట్టించారు వరప్రసాద్, భూపాల్‌లు.

## 3

తనమీద దొంగకేసు బనాయించి జైల్లో పెట్టిన దగ్గరనించీ ఉత్తమచంద్ర గుండెలు మండిపోతున్నాయి. శరీరం కుతకుత ఉడికిపోతోంది. డబ్బు విరజిమ్మి అయినా తనకి ద్వీపాంతరవాసం విధిం

చేట్టున్నాడు వరప్రసాద్! అని ఓ పక్క భయపడ్డాడు కూడా. ఈ రోజుల్లో నీతికి విలువెక్కడ వుంది? ఎక్కడికక్కడ దొంగబతుకులే. ఏదో విధంగా అటు ప్రభుత్వాన్నో, ఇటు ప్రజలనో మోసగించందే కొందరు పెద్దమనుషులకి నిద్రపట్టదు-ఇందర్నీ ఇన్ని విధాల మోస గించి ఆర్జించిన ఈ డబ్బుని రేపు చస్తూ తీసుకువెడతారా? మన వళ్ళకి-మునిమనవళ్ళకీ కూడా జల్సాగా ఖర్చుపెట్టడానికి సరిపోయే డబ్బు సంపాదిస్తారు. బ్రతికిన నాలుగురోజులూ ఈ అక్రమ ధనార్జన కోసం శ్లేష్మంలోపడ్డ ఈగల్లా తన్నుకుంటూరు. ఎందరినో నాశనం చేస్తారు—మరెందరినో పనికిమాలిన వాళ్ళని చేస్తారు. ఇంత కష్టపడో-పడకో—సంపాదించిన ఆ స్తిపాస్తుల గర్వంతో చివరికి ఎవరికోసం అని ఆర్జించిపెట్టారో వాళ్ళు వట్టి పనికిమాలిన వాళ్ళుగా తయారై దమ్మిడీ ఆర్జించడం రాక-ఉన్నది హుషారుగా ఖర్చుపెట్టి—చివరికి అన్నివిధాలా చతికిలపడిపోతారు. ఇవన్నీ ఆలో చించరు. అసలాలోచించాల్సిన అవసరం వున్నట్టు కూడా ప్రవ ర్తించారు. తమ దౌష్ట్యాలకి యెందరు అమాయకులు బలి అయినా యెందరు కన్నీరు కార్చినా వాళ్ళకి పట్టదు. అందుకే ధనవంతులు మరీ ధనవంతులవుతుంటే పేదవారు మరీ పేదవారవుతున్నారు. మధ్యతరగతి వారు పైకిపోయే అవకాశాలకి తిలోదకాలు వదులుకుని-పేదరికంలోకి జారిపోకుండావుంటే చాలనేస్థితికి వస్తున్నారు.

చూడాలి! ఈ లోకంలో ఇంకా ఏ మూలన్నా, నీతీ నియమా లనేవి వున్నాయేమో! ధనమదాంధతకు పేరుబడిన తండ్రీ కుమారులని ఓ ఆట ఆడించకపోతే, అన్యాయానికి—అక్రమానికి—సంకెళ్ళు వేయించకపోతే తనపేరు ఉత్తమచంద్ర కాదు! ఈ భీకరపోరాటంలో అభిమన్యుడిలా నేలకి వరిగినా సరే, వాళ్ళకి బుద్ధిచెప్పి తీరాలి—ఇదే తన ప్రతిజ్ఞ! అనుకుంటూ ఒక్కసారి తన ఇష్టదైవాన్ని వీరాంజ నేయుడిని తలచుకున్నాడు.

రావణుడి సభలో బందీగా చిక్కి ప్రవేశపెట్టబడి నువ్వు ఒక్క దెబ్బతో ఆ బంధాన్ని ఛేదించుకుని, చివరకు లంకకే నిప్పు పెట్టినట్టు నన్నీ శృంఖలాల నుంచి విముక్తుడిని చేయి? నీలాగే ఓ

చూపు చూస్తాను అంటూ ఆంజనేయుడిని తలచుకున్నాడు.

అతనికి జరిగిన అన్యాయానికి ప్రకృతే పలవించిందాన్నట్టు తుఫాను ప్రారంభం అయింది. ఇది నిశ్చయ్యంగా తనకోసమేనని నమ్మిన ఉత్తమచంద్ర సమయంకోసం పొంచివుండి—సమయం చిక్కగానే పలాయనమంత్రం పఠించాడు. సూది దొరికేంత సందు దొరకగానే దాన్ని కందకం అంత వెడల్పు చేసుకుని ఆ నిశ్శబ్ద వీధినిలో బయటపడ్డాడు. గాలి, వాన అతనికి సహాయపడినాయి! దాంతో అతనికి తన ఇలవేల్పుమీద మరింత భక్తి పెరిగిపోయింది. ఎలాగైనా తను విజయవాడ చేరాలి. అక్కడ తనకో మూడుకాళ్ళ ముసలమ్మ దూరపుచుట్టం వుంది పడమట లంకలో. అక్కడికి చేరాలి. టిక్కెట్టు లేకుండా ప్రయాణం ప్రారంభించిన ఆతను రైలు కృష్ణాకెనాల్‌కి వచ్చేసరికి స్లో అవడం గమనించి దైవంమీద భారం వేసి దూకేశాడు. అక్కడనించి అతనా జోరున వానలో నడుచుకుంటూ అడ్డురోడ్డంబడి ప్రకాశం బ్యారేజ్ చేరి అక్కడినించి యాదృచ్ఛికంగానే భూపాల్‌తోటలోకి చేరాడు.

వర్షానికి జడిసి భూపాల్ కనుక మద్రాసు బయలుదేరకుండా వుండివుంటే అతను మళ్ళీ కృష్ణజన్మస్థానానికే చేరేవాడు, ఒక విధంగా. అతన్నా భగవంతుడే కాపాడాడనుకోవచ్చు. అక్కడికి వచ్చాక అది భూపాల్ తోట అని తెలిసి మండిపోయినా తమాయించుకోక తప్పేదేముంది? వాన వెలిసేసరికి తెల్లవారింది. అక్కడినించి నడుచుకుంటూనే పడమట లంక చేరాడు. అతన్ని చూసి ఆవిడ సాదరంగానే ఆహ్వానించింది.

"పెద్దమ్మా! నే నిక్కడే కొన్నాళ్ళు వుండి నీ పొలం చూసి పెడతాను" అన్నాడు ఆపేక్షగా దగ్గర కూర్చుని.

అతడు మద్రాసులో ఉద్యోగం చేస్తున్నాడని ఆవిడకి తెలుసు.

"ఏమిరా! అక్కడ ఉద్యోగం చాలించుకున్నావా?" అని అడిగింది ఆశ్చర్యంగా.

"లేదులే పెద్దమ్మా! ఈ వూళ్ళో బ్రాంచీపెట్టి నన్నిక్కడ పడేశారు. కాస్త నీకు సాయంగా వుంటుందంటే ఇక్కడ వుంటాను.

లేకపోతే వేరే ఇల్లు చూసుకుని వెళ్ళిపోతాను" అన్నాడు బింకంగా.

"వేరే ఇల్లు దేనికిలే. ఇక్కడే వుండు' అందావిడ ఔదార్యంగా.

ఆ కాస్తకే సంతోషించాడు ఉత్తమచంద్ర.

"లే పెద్దమ్మా! వంట నేను చేస్తాను. మద్రాసు సాంబార్లు ఎలా కాస్తారో నీకు తెలియదుగా! నేను చేసిచూపిస్తా కాస్త కొబ్బరి వుందా?" అని అడిగాడు.

"ఆ! ఉందిరా! ఈరోజు ఏకాదశి అని కొబ్బరికాయకొట్టాను" అంటూ తెచ్చి అందించింది. అది రుబ్బి ఘుమఘుమలాడే సాంబారు తయారుచేసి వూరగాయ—సాంబారుతో కడుపునిండా తిని హాయిగా నిద్రపోయాడు ఉత్తమచంద్ర.

ఏదోలే మగాడు ఇంటిపట్టున తనకి సాయంగా వుంటాడు అనుకుంటూ హాయిగా ఆవిడా నిద్రపోయింది.

భూపాల్, హేమలతను ఆ హోటల్లోనే వుంచి తనంతట తానుగా రైల్వేస్టేషను, బస్టాండు అన్నీ కారులో చుట్టివచ్చాడు. అతని ఫోటో చూపించి ఇలాంటి వ్యక్తి కనిపించాడా అంటూ చాలా మందిని అడిగినా ఎవ్వరూ చెప్పలేకపోయారు. మద్రాసులో ఉత్తమ చంద్రవున్న ఇంటికి కాపలాపెట్టారు. అసలతను వచ్చిన జాడకూడ అక్కడ కనిపించలేదు. ఇదిలా వుండగా వో ముప్పై సంవత్సరాల యువకుని శవం సముద్రం దగ్గర కనిపించిందంటూ ఓ ఫోన్ కాల్ వచ్చింది. పోలీస్‌స్టేషన్‌కి ఆ వార్త అందగానే వరప్రసాద్‌కి, భూపాల్‌కి ఫోన్‌చేశాడు యస్. పి. అది ఒకవేళ ఉత్తమచంద్రదే నేమో అన్న అనుమానంతో. ఆ వార్త అందగానే హోటల్నించి భూపాల్, ఇంటినుంచి వరప్రసాద్ తమతమ కార్లలోవచ్చి చేరారు స్టేషన్ దగ్గరకి.

యస్. పి. మరో నలుగురు పోలీసుల్ని తీసుకొని జీపులో బయలుదేరాడు. ముఖం గుర్తించ వీలుకాకుండా వుంది పాంటు—షర్టు ధరించినా.

"ఇతను మీ ఆఫీసులో పనిచేసే అతనేనంటారా?" అని అడి

గాడు యస్. పి. సందేహంగా.

"ఏమో! ముఖంచూస్తే అలాలేదు. కాని ఆ పొడుగు— అవీ చూస్తుంటే కావచ్చనిపిస్తోంది" అంటూ ఆగాడు వరప్రసాద్.

"జైల్లోంచి తప్పించుకు పారిపోయినవాడు సముద్రంలో యెందుకు పడతాడు?" అని అడిగాడు భూపాల్ సందేహంగా.

అవును. ఆమాట నిజమే! చివరకి నిర్ధారణకాక ఎవరి స్థలాలకి వారు చేరుకున్నారు. దాంతో పరిశోధన వున్నచోటునే వుండిపోయింది.

"ఆ ఇన్సూరెన్స్ వాళ్ళ విషయం గట్టిగా కనుక్కుంటే మనం ఆ మేడ అమ్మకం త్వరగా పూర్తిచేయవచ్చు" అంటూ తండ్రిని హెచ్చరించాడు భూపాల్.

"దానికేమంత కష్టం లేదురా భూపాల్! మనకి వ్యతిరేకంగా ఆ ఉత్తమ్‌గాడు బ్రతికివుంటే ఇన్సూరున్స్ కంపెనీకి లాభం. మనకి నష్టం."

"ఇంత బాధ పడేబదులు ఆ కంపెన్సేషన్ మాట మర్చిపోయి ఇల్లు బేరం రైట్ చేసుకో నాన్నా! ఏ గొడవా వుండదు. చచ్చినవాడి పెళ్ళికి వచ్చిందే కట్నం అని — వాళ్ళెంతిస్తే అంతే పుచ్చుకుని మేడ అమ్మేసెయ్యి. ఇంకో రెండురోజులకంటే ఇక్కడ వుండటం కుదరదు నాకు" అన్నాడు భూపాల్.

చివరకి వరప్రసాద్‌కి అదే మేలని తట్టింది. "ఈ కేసులకే చాలా పోసాను. ఆ ఖర్చుల విలువన్నా ఫైర్ ఇన్సూరెన్స్‌నించి వస్తే చాల్లే" అనుకున్నాడు తగ్గిపోతూ.

వెంటనే తన బిల్డింగ్ కొంటానన్న ఆయన్ని పిలిచాడు. ఆయనతో మాట్లాడుతూ చాలాసేపు గడిపారు తండ్రీ కొడుకులు. చివరకి డబ్బు సెటిల్మెంటు జరిగి అడ్వాన్సు పుచ్చుకున్నారు. ఆడబ్బు తీసుకొని భూపాల్ హేమలతతో విజయవాడ వచ్చాడు.

భూపాల్‌ని చూడగానే భీమసింగ్ ముఖం ఇంత అయింది.

"అమయ్య! క్షేమంగా వచ్చారు అంతేచాలు బాబూ! మీరు వెళ్ళగానే పడిన వర్షానికి గుండెలు తల్లడిల్లిపోయాయి" అన్నాడు

భీమసింగ్ ఆనందంగా.

"ఏ తుఫానులు వచ్చినా మననేం చేయవు భీమ్" అన్నాడు గర్వంగా టేబుల్ మీదకు కాళ్ళు బారసాచి.

"అదేగదా బాబూ కావలసింది. ఇంతకీ వెళ్ళినవని కాయా పండా బాబు" అని అడిగాడు.

"పండే, మనం ఏదనుకుంటే అది నిర్విఘ్నంగా జరగవలసిందే" అంటూ జేబులో దాచిన యాభయివేలుతీసి "ఇది సీక్రెట్ రూంలో బీరువాలో వుంచు. తర్వాత మాట్లాడుకుందాం" అంటూ అతని చేతికి అందించాడు.

అతిప్రేమగా అందుకున్నాడా డబ్బుని భీమసింగ్. తీసుకు వెడుతూ ఆ నోట్లకట్టల్ని ముద్దుపెట్టుకున్నాడు. అతను చెప్పినట్టే బీరువాలో దాచివచ్చాడు.

అతడొస్తాడని అనుకుంటూనే వున్నారు కనుక కూరలు, వగైరాలన్నీ రెడీగానే వుంచారు. క్షణాలమీద వంటచేసేసింది లక్ష్మి.

భోజనాలు అయ్యేంతవరకూ మళ్ళీ మాట్లాడుకోలేదు. అవి అయ్యాక భూపాల్ సావకాశంగా కిళ్ళీ నములుతూంటే "అయితే సాబ్! ఆ ఖైదీలకి శిక్షపడిందా?" అని అడిగాడు భీమసింగ్.

"ఎక్కడ? ఒకడు తప్పించుకు పారిపోయాడు. వాడివల్ల మనకి ఎప్పుడైనా దేంజరే!" అన్నాడు సాలోచనగా భూపాల్. ఆ మాట వింటూ పిడుగుపడినట్టు చూశాడు భీమ్.

"ఎలా తప్పించుకున్నాడు?" ఆశ్చర్యంగా అడిగాడు.

"ఎలా తప్పించుకున్నాడో తెలియకే తికమకపడుతున్నాం అందరూను" అంటూ లేచాడు విసుగ్గా.

భీమసింగ్‌కి యేమనడానికీ తోచక బిక్కముఖం వేశాడు.

"ఈ వూరు రావచ్చంటారా?" అని అడిగాడు ఆదుర్దాగా.

"ఎలా వస్తాడు? వాడి దగ్గర డబ్బు యేమీ లేదు. మద్రాసు నించి యిక్కడికి రావాలంటే నడిచి రాలేడు గదా?" అన్నాడు భూపాల్.

"అదీ నిజమే లెండి! అయినా మనం మన ప్రయత్నాలు

చేయాలిగదా!"

"చేస్తున్నాం—పేపర్లో వేయించాము. ఎక్కడో పట్టుబడక పోడులే" అంటూ తన గదిలోకి వెళ్ళిపోయాడు భూపాల్.

దాంతో, తుఫానులో తమ ఆతిధ్యం స్వీకరించిన వ్యక్తిని గురించి చెప్పాలనుకున్న భీమసింగ్ నోరు మూతబడిపోయింది.

హేమలత అతని రాక కోసమే నన్నట్టు గుమ్మం దగ్గరే వుంది.

"ఏం హేమా! నిద్రపోలేదూ!" అని అడిగాడు భూపాల్ ఆమె భుజంమీద చేయివేస్తూ.

"మీరు రాకుండానా?" అంది చిరునవ్వు నవ్వుతూ.

"వచ్చాక నీకు అసలు నిద్రవుండదు. అందుకే నేను రాక ముందే వో నిద్రతీసి లేవడం చాలా మంచిది" అన్నాడు కొంటెగా.

"ఇంతకీ ఆ ఖైదీవల్ల మీకేమన్నా ప్రమాదం వుంటుందా?"

"ఆస్తి నష్టం కలగవచ్చు. అంతేగాని మనిషికేం ప్రమాదం" అన్నాడు ఆమె ముంగురులు సవరిస్తూ.

"ఏమో! ఎందుకయినా మంచిది మీరు జాగ్రత్తగా వుండండి."

అలాగేనన్నట్టు తలవూపాడు భూపాల్.

తెల్లగా తెల్లవారాక ఆ డబ్బు తీసుకుని జేబులో పెట్టుకొని బయలుదేరాడు భూపాల్.

"తనకివ్వకూడదా!" అనుకున్నాడు భీమసింగ్.

"ఏమన్నా నగలు కొనిపెట్టు" అంది హేమలత.

వెంటనే జ్యూయలరీ మార్టుకి వెళ్ళి ఆమెకు నచ్చినవి కొని పెట్టాడు.

"భీమ్! ఎవరన్నా కొత్తవాళ్ళు వస్తే జాగ్రత్తగావుండు. పి. ఐ. డీల తాలూకు వారయితే నేనసలిక్కడికి రాలేదని—హైద్రాబాద్‌లోనో, మద్రాసులోనో వుంటానని చెప్పు."

కొత్తవాళ్ళంటే చటుక్కున అతిధి గుర్తు వచ్చాడు భీమసింగ్‌కి.

"ఆరోజు తుఫానప్పుడు సరిగా మీలాంటి ఆయనెవరో వచ్చి

తుఫాను తగ్గేదాకా వుండి వెళ్ళాడు సాబ్" అన్నాడు భీమసింగ్.

"నాలాంటి వాడా?" అన్నాడు ఆశ్చర్యంగా.

"ఆః ఎత్తు, పొడుగు మీలానే వుంటారు. కాకపోతే మీ కంటే కాస్త తెల్లగా వుంటారు."

భూపాల్ ఆలోచనలో పడ్డాడు. "అతని పేరేమిటో చెప్పాడా?"

"ఆ(ః చెప్పేడుగాని గుర్తుండి చచ్చే పేరుగాదు."

"మా ఖైదీ ఉత్తమచంద్ర కాదుగదా?" అన్న అనుమానం కలిగినా "ఛః అది అసంభవం, అతనలా విజయవాడ రాగలడా?" అని కొట్టిపారేశాడు.

"ఎవరోలే. మన ఖైదీపేరు ఉత్తమచంద్రః ఆ పేరుగల వాడెవడయినా వస్తే సీక్రెట్ రూంలో కట్టిపడేసి నాకు ఫోన్‌చెయ్యి" అన్నాడు భూపాల్.

"అతనిపేరు చంద్ర అనేం చెప్పలేదు సాబ్. ఉత్తమ్ అని అన్నట్టు గుర్తు."

"ఉత్తమ్" అనుకుంటూ ఆశ్చర్యంగా చూశాడు భూపాల్.

"పోలీసుల కధనం ప్రకారం ఆ టైములో అక్కడే వున్నాడుగా."

భూపాల్ బుర్ర గిరగిరా తిరిగిపోతోంది. ఉత్తమచంద్రలాటి వ్యక్తే సముద్రంలో పడిపోయాడని ఆ రోజు తామంతా చూసివచ్చారు. ఇప్పుడీ భీమసింగ్ మాటలు చూస్తే అక్కడినించి ఇక్కడకి వచ్చి చేరినట్టే అర్థం అవుతోంది.

"అతనెక్కడకి వెడతానన్నాడో చెప్పాడా?"

"ఆః బందరువెళ్ళాలన్నాడు" గుర్తు తెచ్చుకుంటూ అన్నాడు.

"చేతిలో ఏమన్నా వున్నాయా?"

"ఏం లేవు, రైల్లో సూట్‌కేస్ కొట్టేశారన్నాడు."

మద్రాసునించి ఎక్స్‌ప్రెస్‌లో టిక్కెట్టు లేకుండా ఉత్తమచంద్ర ప్రయాణంచేసి విజయవాడ రాగలడా? అని సందేహిస్తూ వున్నాడు భూపాల్.

చివరకి ఇన్‌ఫర్మేషన్ తండ్రిద్వారా పోలీసు స్టేషనులో తెలియబరిస్తే వాళ్ళే చూసుకుంటారు బందరు బందోబస్తుతో. ఈమాట తట్టగానే జేబులోంచి వెయ్యిరూపాయలుతీసి అతని చేతికిస్తూ "భీమ్! అతనే ఉత్తమచంద్ర అన్న అనుమానం కలుగుతోంది నాకు. అందుకే బందరుకి పోలీసుకాపలా వుంచి అతన్ని పట్టేయిస్తాను" అన్నాడు కారులో కూర్చుంటూ.

భీమసింగ్ ముఖం ఇంత అయింది. ఆ వెయ్యిరూపాయలూ తీసుకుని కళ్ళకద్దుకుని దాచుకున్నాడు. మద్రాసునించి వచ్చినప్పటి కంటే రెట్టింపు ఆలోచనలతో బయలుదేరాడు భూపాల్ హైద్రాబాద్‌కి.

## 4

ముసలమ్మ ఎదురుగా ఉద్యోగం లేనట్టు బయటపడటం ఇష్టం లేక ఉత్తమచంద్ర విజయవాడలోని ప్రముఖ కంపెనీలచుట్టూ తిరగసాగాడు ఉద్యోగంకోసం. అలా తిరుగుతూ గవర్నరుపేటలో కృష్ణా అండ్ కంపెనీ దగ్గరకు వెళ్ళాడు. అక్కడ మేనేజరు లేడు. బయటకి వెళ్ళాడు. ఆయనకి స్టెనోగావున్న అమ్మాయి కనిపించింది.

"నమస్కారమండీ!" అంటూ వినయంగానే అన్నాడు ఉత్తమ్. ఆ అమ్మాయి కళ్ళింత చేసుకుని అతన్ని చూడసాగింది.

"ఇక్కడేమన్నా వేకెన్సీలున్నాయా?" ఆడపిల్ల చూపుకు తట్టుకోలేక తలవంచుకుని అడిగాడు ఉత్తమచంద్ర.

"మీ పేరేమిటి?"

"ఉత్తమచంద్ర."

ఆ పేరువిని ఉలిక్కిపడి చూసిందామె.

"ఇంతక్రితం మీరు మద్రాసులో వున్నారా?"

ఆ మాటకి అదిరిపడ్డాడు ఉత్తమచంద్ర.

"ఏం అలా అడుగుతున్నారు?" అన్నాడు మెల్లగా.

"ఏం లేదులెండి. మీరు ఇప్పుడెక్కడ వుంటున్నారో అడ్రసు వ్రాయండి. అసిస్టెంటు కావాలని మా మేనేజరుగారు అంటున్నారు. ఆయన వూళ్ళోలేరు. రేపు వస్తారు. రాగానే మీకు లెటర్ వ్రాస్తాను."

"పోనీ రెండురోజులు ఆగి నేనే వస్తానులెండి" అన్నాడు ఉత్తమచంద్ర.

"వూరికే తిరగడం దేనికి? అడ్రసు ఇచ్చినందువల్ల మీకు నష్టం అనుకుంటే ఇవ్వకండి" అంది నిష్ఠూరంగా.

ఆ మాట ఆమె అన్నాక వెంటనే కాగితం—కలం తీసుకుని ఆమెకి పడమటలోని తన అడ్రసు రాసిచ్చాడు.

"థాంక్స్" అంటూ అందుకున్న ఆమెనే చిత్రంగా చూసి బయటకు వచ్చేశాడు ఉత్తమచంద్ర.

నేరుగా ఇంటికి వచ్చి మంచంమీద వాలిపోయాడు.

మధ్యాహ్నం తను చూసిన కంపెనీ—అందులో ఆ స్టెనో-మాటిమాటికీ కళ్ళముందు తిరుగుతున్నారు. తననే ఆమె పరీక్షగా చూడటం, మీది మద్రాసా అని అడగడం—పట్టుపట్టి తనచేత అడ్రసు వ్రాయించుకోవడం—అంతా అనుమానంగానూ, అయోమయంగానూ కూడా వుంది.

కొంతతీసి ఈవిడ భూపాల్‌గాడి తాలూకు మనిషి కాదుగదా! అయితే తన కంఠానికి ఉరిత్రాడు తగిలించుకున్నట్టే! ఇప్పుడు తన మీద ఒకటికాదు. రెండునేరాలాపాదించబడుతాయి ముందుది కాక. జైల్లోంచి తప్పించుకున్న నేరం కూడా.

ఛీ! తనామెకెందుకు అడ్రసు రాసిచ్చాడు! అనుకుంటూ నొచ్చుకున్నాడు. ఆమె నిజంగా చెప్పవలసివస్తే చాలా అందంగా వుంది. ఆ అందానికి తన బ్రహ్మచారి మనస్సు కాస్త గతితప్పిన పొజిషన్‌లో మతిపోయి రాశాడు. అంతే! అదే మగాడయితే తనచేత కాగితంమీద కలం పెట్టించగలిగేవాడా!

"ఒరేయ్! చంద్రా! నేనలా శివాలయానికి వెడుతున్నా!" అంటూ కేకపెట్టి వెళ్ళిపోయింది ముసలమ్మ మీనాక్షమ్మ.

"రక్షించావు" అనుకున్నాడు.

ఆవిడే తలుపులు దగ్గరకి వేసి వెళ్ళిపోయింది. ఆవిడ వెళ్ళిన పదినిముషాలకి తలుపుమీద టకటక మంటూ కొట్టిన శబ్దం అయి ఉలిక్కిపడి "కమిన్" అన్నాడు.

వెంటనే తలుపు నెట్టుకుని లోపలకి వచ్చిన వ్యక్తిని చూసి విశ్చేష్టుడై తపీమని లేచి కూర్చున్నాడు. ఆ వచ్చింది తను ఆలోచిస్తున్న స్టెనో!

"నన్ను చూసి ఆశ్చర్యపోతున్నారా?" అంది నవ్వుతూ.

"ఆశ్చర్యమే మరి! మీలాంటివారు నాలాంటి వాడి యిల్లు వెతుక్కుంటూ రావడం" అంటూ కుర్చీ చూపించి "కూర్చోండి" అన్నాడు తనుకూడా సర్దుకు కూర్చుంటూ.

"నా మీద మీకు రకరకాల అనుమానాలూ వచ్చివుంటాయి" అంది కూర్చుంటూ.

"దేనికి?" అన్నాడు నవ్వుతూ.

"మద్రాసునించి వచ్చారా అని అడగడం—అడ్రసు తీసుకోవడం" అంటూ నవ్వింది.

"ఆ మాటలో నిజం లేకపోలేదు" అన్నాడు నెమ్మదిగా.

"కాని ఒక్క విషయం. నేను మీ మేలుకోరేదాన్ని కాని కీడు తలచేదాన్ని కాదు అని మీరు గ్రహిస్తే మంచిది" అంది స్థిరంగా.

"ఇంతకీ మీ రెవరో నాకు తెలియదు—నా మేలో—కీడో కోరుతూ వుంటారని యెలా అనుకోను?" ఎదురుప్రశ్న వేశాడు ఉత్తమ్!

"మీరు మద్రాసులో భూపాల్ అండ్ కంపెనీలో పనిచేశారు గదూ!"

ఆమె అన్న ఆ మాట సంధించి వదిలిన బాణంలా దూసుకుపోయింది ఉత్తమ్ గుండెల్లోంచి.

"మీ కెలా తెలుసు?" గాభరాగా అడిగాడు.

"ఈ పేపరు చూడండి మీరు—" అంటూ అందించింది. అందులో తన ఫోటో వుంది. క్రింద పట్టి ఇచ్చినవారికి బహుమతి కూడా వుంది.

"అయితే మీరు నన్ను గుర్తించారు గనక పోలీసులకి అప్పగించి వెయ్యినూట పదహార్లు కొట్టేయండి" అన్నాడు రాని నవ్వు

తెచ్చుకుంటూ.

"అంత మూర్ఖురాలిని కాదులెండి. అంత కక్కుర్తి నాకు లేదు. వూరికే మీకు చూపించాలని తెచ్చాను" అంటూ మళ్ళీ అ పేపరు తీసుకుని తన దగ్గర అట్టిపెట్టుకుంది.

"మీ మంచితనానికి సర్వదా కృతజ్ఞుడిని'' అన్నాడు తనలోని సంచలనాన్ని కప్పిపుచ్చుకుంటూ.

ఆ మాటకి సూటిగా చూసింది అతనికేసి "అనవసరంగా జైలుపాలయింది మీరు. మీ మంచితనం ముందు గట్టిగా చెప్పవలసి వస్తే నేనెందుకూ సరిపోను" అంది ఆమె.

ఆ మాటకి మరింత ఆశ్చర్యంగా చూశాడామెకేసి. ఈవిడెవరో గాని తన జీవితమంతా క్షుణ్ణంగా తెలుసుకునే వచ్చింది అనుకున్నాడు.

"లోకంలో ధనమధాంధత్వం—భోగలాలసత, అహంకారం పెచ్చురేగుతుంటే అమాయకులంతా సమిధల్లా మాడిపోతున్నారు వారిముందు. నిజం ఎవరికీ రుచించదు. అలా ముక్కుకు సూటిగా పోయేవారిని-నీతి నిజాయితీలంటూ పోయేవారిని ఎవరూ పైకి తేలనివ్వరు-ఎక్కడికక్కడ స్వలాభం. వీటన్నింటికీ భూపాల్. మంచి ఉదాహరణ. ఆ తండ్రీకొడుకుల పాపం పండేదెప్పుడో!" అంటూ బలంగా గుద్దింది కుర్చీమీద.

"చూడగా మీరు నాకంటే ఆవేశంగా కనిపిస్తున్నారు" అన్నాడు తెల్లబోతూ.

"అవును. వాళ్ళపేరు చెబుతే నా వళ్ళు కుతకుతా ఉడికిపోతుంది. వాళ్ళల్లో ఒకళ్ళనైనా నేను షూట్ చేయగలితే ఉరిశిక్ష వేసినా సంతోషంగా చస్తాను" ఉద్రేకంతో ఊగిపోతూ అంది ఆమె.

ఆ మాటకి హడలిపోయాడు ఉత్తమచంద్ర. తనేదో విధంగా బుద్ధి చెప్పాలని ఆలోచించడమేగాని చంపిపారేయాలనుకోవడం లేదు—ఈమె యెవరో తనని మించిపోయింది అనుకున్నాడామెకేసి పరీక్షగా చూస్తూ.

"మీ కెందుకా కక్ష?" మెల్లగా అడిగాడు.

"ఎందుకా! ఆడదాని శీలంతో ఆటలాడి, ఆ ఆడపిల్లకి పూర్తిగా అయిష్టం అయితే బలవంతాన ఆమెని అనుభవించడమే గాక ఆమెని మాటలతో న్యూనతపరచితే యే ఆడపిల్ల, ఏ అభిమాన వతి భరిస్తుందో చెప్పండి," అంది రోష కషాయిత నేత్రాలతో చూస్తూ.

ఆ మాటలకి కొయ్యబారిపోయాడు ఉత్తమచంద్ర.

అతని కేమనడానికీ పాలుపోక "అలాంటి పనులు చేసిన మగవాడిమీద మీరు కేసు పెట్టి ఏడేళ్ళు జైల్లోకి నెట్టించవచ్చునే!" అన్నాడు.

ఆ మాటకి ఎంత వెర్రివా డన్నట్లు చూసిందామె.

"లోకంలో—న్యాయాన్ని అన్యాయంగా, నీతిని—అవి నీతిగా—మంచిని—చెడ్డగా మార్చగల మహిమ ఒక్క డబ్బుకే వుంది. అలాంటి మహిమ పుష్కలంగా వున్న భూపాల్‌ని గాని—అతని తండ్రిని గాని జైల్లో పెట్టించడం అంత సులభమనుకున్నారా? మనం ఒకటి అనేలోగా మనమీద వంద నిందలు వేస్తారు. అవన్నీ వచ్చి నిజాలని ఋజువులు కూడా చేస్తారు. దాంతో మొత్తం కథ అడ్డం తిరిగి వారి బదులు మనం వెళ్ళి కూర్చుంటాం జైల్లో. చివరికి ఏం చేయడానికీ వీలులేక—అవమాన భారంతో చచ్చి వూరు కుంటాం. అందుకే రెండువేపులా పదునున్న కత్తిలాంటి వాళ్ళిద్దర్నీ మనం పరలోకానికి పంపిస్తే తప్ప వాళ్ళని ఎదిరించి గెలవడం అన్నది అసంభవమన్నర. అందుకే వాళ్ళని యే విధంగా చంపాలాని అహర్నిశాలూ ఆలోచిస్తున్నాను" అంది.

ఆ కళ్ళల్లో ప్రజ్వరిల్లుతున్న ప్రతీకార జిగీషకు ఉత్తమచంద్రే జంకాడు.

"మీ పేరేమిటి?" అని అడిగాడు.

"సూర్యమిత్ర."

"భేష్! మీ పేరు చాలా బాగుంది."

"మరే మీ పేరులాగే!" అంది చిలిపిగా! ఇందాకటి క్రోధాగ్ని కీలలేం లే వా కళ్ళల్లో యిప్పుడు. అది చూసి సంతోషించాడు

ఉత్తమ్.

"నాకు మీరు సహాయం చేయాలి" అందామె.

"చెప్పండి."

"మీరు వారివల్ల అన్యాయమైనవారే! నేనూ వారివల్ల వంచితు రాలయినదాన్నే! మనలాంటి మందభాగ్యులింకా ఎందరున్నారో మరి మనకే తెలియదనుకోండి. వారందరి పెదవులపై దరహాస చంద్రికలు వెలుగొందించాలంటే ఆ దుర్మార్గుల నిద్దర్నీ యమపురికి పంపిం చడమే మంచి పని. మీ రా పని చేయగలరా?"

"హత్యలు చెయగలిగే వ్యక్తిలా కనిపిస్తున్నానా నేను?" అని అడిగాడు నవ్వుతూనే ఉత్తమచంద్ర.

"మన హృదయపు మంటలు ఆరడంకోసం మన యింటా వంటా లేకపోయినా మనం తలపడాలి. తప్పదు."

"నాకు అంత పని చేయడానికి ధైర్యం ఉందనుకోను."

"మద్రాసు జైలునించే తప్పించుకోగలిగారంటే మీరు చాలా ధైర్యవంతులనీ—నా కోరిక మీ వల్లే నెరవేరాలని ఒక విధంగా మీ కోసం కాచుకున్నాను నేను. చివరికి మీరు కనబడినా మీలో తెగింపు కనిపించడంలేదు" అంది నిర్మోహమాటంగా.

"మీ పాలసీ ఉగ్రవాదం—దాంతో ఏకీభవించడానికి నా మనస్సు ఒప్పుకోవాలి. మీరు చెప్పినట్లు చేయడానికి ముందు ఆలో చించాలి గదా బాగోగులు-ఒక్క వరప్రసాద్, ఒక్క భూపాల్‌లతోనే నే నిండి వుందా యీ ప్రపంచం? అలాంటివారు లక్షల సంఖ్యలో వుంటారు. వారి నందర్నీ మీరు చెప్పినట్లు చేస్తూ ఎంతకాలం పోగ లమో చెప్పండి—వారిలో పరివర్తన రావాలిగాని!"

"పరివర్తనా! మీ రే కాలంలో వుండి మాట్లాడుతున్నారో గాని—వారిలాంటివారిలో పరివర్తన నాశించడం తివిరి ఇసుమున తైలంబు తీయవచ్చు పద్యం గుర్తు చేసుకోండి—" అంది సూర్య మిత్ర.

"అవన్నీ సాధ్యపడినప్పుడు ఇది కూడా సాధ్యపడక పోతుందాని."

"పడదు—పడదనే పెద్దలు ఖచ్చితంగా చెప్పారు. దాన్ని కాదనడం బుద్ధితక్కువ."

ఉత్తమచంద్ర మాట్లాడలేదు.

"మీరేమిటిలా ఆలోచనలో పడిపోయారు."

"మీరలాంటి విషయం చెప్పినప్పుడు ఆలోచించకుండా ఇలా వుండటం!"

"ఆలోచించండి. తొందరేంలేదు. మీ కిష్టమైతే ఎల్లుండి సాయంత్రం అయిదింటికి లచ్చిపేట వెంకటేశ్వరస్వామి గుడి దగ్గరకు రండి. ఆరున్నరవరకూ యెదురుచూస్తాను. మీ కిష్టం లేకపోతే రావద్దు. అదే మీ అంగీకార నంగీకారాలకి గుర్తు" అంటూ లేచింది సూర్యమిత్ర.

తనూ లేచాడు. "అరే! మీ మాటల చాతుర్యంతో నా బుర్ర పని చేయకుండా చేశారు. మీకు కనీసం కాస్త కాఫీ అన్నా యివ్వలేదు. ఆగండి. ఇస్తాను—" అంటూ వంట గదిలోకి పోబోయాడు.

"ఏమీ అక్కర్లేదు. నేను వస్తూ తాగే వచ్చాను" అంటూ మృదువుగా వారించింది.

ఉత్తమచంద్ర అలాగే చూస్తుండిపోయాడు. ఆమె చెయ్యి వూపి వెళ్ళిపోయింది.

అబ్బ! ఈమె చాలా ఘటికురాలు. తాడియెక్కేవాడికి తల దన్నేవాడన్నట్లు తనని మించిన ధైర్యస్తురాలిలా వుంది. అన్నింటినీ మించి తన బుర్ర పనిచేయనీయకుండా ఏ మత్తు చల్లిందోమరి! కాఫీ యివ్వడంలాంటి సాధారణ మర్యాదలుకూడా మరిపించేసింది. ఝాన్సీబాయి, రుద్రమదేవిలాంటి వీరనారీమణుల అంశలో జన్మించినట్లుంది. లేకపోతే అంత వాడి - వేడి—ఆవేశం—ఉద్రేకం వుండవు" అనుకున్నాడు విభ్రాంతంగా.

ఉత్తమచంద్రకి ఆడవాళ్ళతో పరిచయాలే తక్కువ. "అపర ప్రవరాఖ్యుడు—అపర భీష్ముడు అంటూ విద్యార్థి దశనించీ ఆడా, మగా కూడా బిరుదులిచ్చారు. ఆ టైటిల్స్ ఇచ్చిన వేళావిశేషం అవే

ఇప్పటికీ కొనసాగుతున్నాయి. ముప్ఫయి యేళ్ళు వచ్చినా అతనికి పెళ్ళిమీద మనసు పోలేదు. ప్రేమమీద మనసు పోలేదు. అసలతవి మనస్సును చూరగొనే సౌందర్యవతి అంతవరకూ కనిపించకపోవడం కూడా ఓ కారణమే!

ఇంతకీ భూపాల్‌నిగాని వరప్రసాద్‌నిగాని మట్టుబెట్టగల అవకాశాలు తనకి వున్నాయా? ముఖాముఖి తలపడి ఏ పిస్టల్‌తోనో ప్రాణం తీయగల తెలివి - చాకచక్యం తనకి వున్నాయా? అన్న సంకుల చిత్తంతో ఒకసారి—"ఏం! అన్యాయంగా నీమీద నేరారోపణచేసి జైల్లో పెట్టించి మగ్గబెట్టలేదూ! ఇప్పుడు మాత్రం తన సంకటస్థితి వదిలిందా? మరింత బిగుసుకుంది" అంటూ తిరగబడుతోంది మనస్సు. తను ఏ ఉద్దేశంతో అదృష్టవశాత్తూ ఆ గోడల మధ్యనించి తప్పించుకు వచ్చాడో అది నెరవేరుతుందా! ఇప్పుడీ మధ్యలో ఎదురైన సూర్యమిత్రని, సూర్యమిత్ర మాటలనీ ఏ విధంగా తీసుకోవాలి? ఆమె చెప్పినట్టు తమకి ద్రోహంచేసిన వారిద్దర్నీ నామరూపాలు లేకుండా చేయడం ఎలా? ఈ ఆలోచనలతో బుర్ర హీటెక్కిపోయింది.

"ఏమిరా అలాగే పడుకున్నావు" అంటూ మీనాక్షమ్మ వచ్చేసరికి ఉలిక్కిపడి ఆలోచనల్లోంచి తేరుకుని "ఏమిటో పెద్దమ్మా! తల దిమ్ముగా వుంది. ఈ వూరి నీళ్ళు పడ్డాయోలేదో. కొత్తకదూ" అన్నాడు కణతలు రుద్దుకుంటూ.

"కాస్త ఓరోజు శలవుపెట్టి విశ్రాంతిగా పడుకో!" అంటూ సలహా ఇచ్చి లోపలకి వెళ్ళిపోయింది.

ఆ రాత్రికి కాస్త ఎంగిలిపడి నిద్రపోయాడు. తెల్లవారిన దగ్గర్నించి మళ్ళీ సూర్యమిత్ర మాటలు గింగురుమంటున్నాయి. తను ఏదో చేయాలనేగదా బయటపడింది జైలునించి. మరి ఏమీ చేయకుండా ఇలా ముసలమ్మ ఎదురుగా కూర్చుంటే ఏం వస్తుంది? అలా అవి హత్య చేయడమే మార్గమా? మరి ఏ విధంగా తన నిర్దోషిత్వం తెలియబరచి వాళ్ళు చేస్తున్న అక్రమాలని బయటపెట్టి సానుభూతి సంపాదించడం! అనుకుంటూ ఆలోచనల మధ్యే అన్ని పనులూ కావిచ్చుకుని పడుకున్నాడు మళ్ళీ. మీనాక్షమ్మ మిరియాలువేపి మంచి

ఘాటుగా చారుకాచింది. అది పోసుకుని తిని మళ్ళీ మంచానికి అడ్డం పడ్డాడు. రేపు సాయంత్రం కాదు. మరో నాలుగు సాయంత్రాల తరువాతనైనా ఆమెకి జవాబివ్వగలడా తను. ఒకవేళ తను ఆమె మాటకి "నో" అంటే, తనమీద కోపంకొద్దీ తనిక్కడున్నట్టు చెప్పేస్తుందేమో! ఆ భయమూ వుంది ఓపక్క. అలా అని ఆ యిద్దర్నీ ఏ విధంగా తుదముట్టించాలో తనకే తెలియదు. ఏనుగు చచ్చినా, బ్రతికినా పదివేలేనన్నట్టు తను బతికి పట్టుబడినా నేరమే! ఒకవేళ వాళ్ళిద్దర్నీ తుదముట్టించినా తను శిక్షార్హుడే. మొత్తంమీద నేరస్తుడిగా ముద్రపడి వున్నవాడే! ఇంక తను ఏం అనుకున్నా ఏం లాభం? తను నేరస్తుడు కాదని ఋజువయినప్పుడు తప్ప తనంటే ఎవరికీ సానుభూతి వుండదు. ఇలాంటి స్థితిలో ఓ ఆడపిల్లకి సాయంచేసి చావడమే-శిక్ష అనుభవించడమే మంచిది. ఈ మాట తట్టింది ఆమె చెప్పిన గడువుకు ఇంక ఒక గంట వుందనగానే. అందాకా వెళ్ళనా, మాననా అన్న సందేహంతోనే సతమతమయ్యాడు. నాలుగు గంటలకి ఆ నిశ్చయానికి వచ్చి గబగబా ముఖం కడుక్కుని రాత్రి ఉతుక్కుని ఆరేసుకుని తెల్లవారి ధరిస్తుండే పాంటు-షర్టు వేసుకుని వెంకటేశ్వర స్వామి గుడికి బయలుదేరాడు. మీనాక్షమ్మకి కూడా సూట్‌కేస్ కొట్టేశారు రైల్లో అనే చెప్పాడు. ఆవిడే దయదలకి రెండు లుంగీలు కొని పెట్టింది.

## 5

సరిగ్గా అయిదున్నర అవుతూండగా జేబుల్లో రెండు చేతులూ పెట్టుకుని మెల్లగా అడుగులో అడుగువేస్తూ గుడి చేరుకున్నాడు. గుడి ధ్వజస్తంభం దగ్గరే వుంది సూర్యమిత్ర. అతన్ని చూడగానే ఆమె భయాలన్నీ విహంగాల్లా ఎగిరిపోయాయి. అంతవరకూ వస్తాడా! రాడా! అన్న సంశయంతో హృదయాంబరాన్ని ఆవరించుకున్న కారుమేఘాలన్నీ పెద్దగాలికి చెదిరిపోయి స్వచ్ఛమైన వినీలాకాశం బయట పడినట్లే తెరిపిన పడిందామె హృదయం.

"మీకోసం అరగంటనించీ వెయిట్ చేస్తున్నాను" అంది

నవ్వుతూ.

"వెరీ సారీ. ఆలస్యం చేసినందుకు" అన్నాడు ఉత్తమ్.

"ఫరవాలేదు లెండి. ఆలస్యం అయినా అసలు వచ్చారు. నా నిరీక్షణ ఫలించింది. అందుకే సంతోషంగా వుంది."

"మనం ఈ గుడికంటే వేరే ఎక్కడన్నా మాట్లాడుకోవడం మంచిది" అన్నాడు ఉత్తమచంద్ర.

"అవును. ఇక్కడకూడా బాగా జనం వున్నారు. వేరే ఎక్కడికి వెడదాం?" అంది సాలోచనగా.

"మీ యిష్టం. మనకి సేఫ్టీ అనుకున్న ప్రదేశం ఎక్కడికైనా సరే."

"అయితే మా యింటికి రండి."

"మీ యింట్లో ఎవరూ వుండరా?"

"ప్రస్తుతం ఎవరూ లేరు" అంటూ రిక్షా పిలిచింది. తన యింటికి మాట్లాడి "యెక్కండి" అంటూ ఉత్తమచంద్ర కేసి చూపింది.

మౌనంగా ఎక్కి కూర్చున్నాడు. ఆమె నిర్భయంగా రిక్షా ఎక్కి అతని పక్కనే కూర్చున్నా తగలకుండా కాస్త ఒదిగే వుంది. 'తన ధైర్యం ఏ డిగ్రీలో వుంటుందో తన వూహ కందదుగాని ఈమె మటుకు వీరనారీమణే!' అనుకున్నాడు తన పక్కనే కూర్చున్న ఆమెనిచూసి. అంత ధైర్యం ఏ ఆడపిల్లకీ వుండదు. అది మాత్రం గ్యారంటీగా చెప్పగలడు. అతనామెని, ఆమె రూపాన్ని-అన్నింటినీ మించిన ఆమె ధైర్యాన్నిచూసి ఆశ్చర్యంతోనే ఆమె ఇంటికిచేరాడు. తలుపు తాళంతీసి "రండి లోపలకి" అంది సూర్యమిత్ర.

ఆ గదుల్ని పరిశీలనగా చూస్తూ లోపలకి అడుగుపెట్టాడు ఉత్తమచంద్ర.

అది మూడుగదుల ఇల్లు. కిటికీలు-అల్మారాలూ, అన్నింటికీ కర్టన్లు వేలాడుతున్నాయి. ముందుగదిలో రెండు వైరు కుర్చీలు—ఓ పేముకుర్చీ, గుండ్రని బల్ల. దానిమీద ఆరోజు పేపరు. అది ఎగిరి పోకుండా పేపర్ వెయిట్. గోడన గాంధీ, నెహ్రూ, సర్వేపల్లి రాధా

కృష్ణ బొమ్మలుగల క్యాలండర్లు. మరోపక్క- ప్రశాంతవదనంతో అందర్నీ పరికిస్తున్న కనకదుర్గ చిత్రపటం.

"కూర్చోండి" అంటూ కుర్చీ చూపించి ఫాన్ ఆన్‌చేసి లోపలికి వెళ్ళిపోయింది. అతనలాగే కూర్చుని గోడల్ని-బొమ్మల్ని పరికిస్తుండగా రెండు కప్పుల్లో కాఫీ పోసుకుని తీసుకువచ్చి "త్రాగండి" అంది.

విస్మయంగానే అందుకున్నాడు.

"మొత్తానికి మీరు నేను తప్పక వస్తాననే ఉద్దేశంతోనే ముందుగానే ఈ ఏర్పాట్లన్నీ చేస్తున్నట్టు కనిపిస్తున్నారు" అన్నాడు ఉత్తమ్ కాఫీ తాగుతూ.

"అవును. మీరు తప్పక వస్తుకుంటారనేనా మనస్సు చెప్పింది."

"ఎందుకనో!"

"ఎందుకని ఏముంది? పరాభవం—అవమానం అలాంటివి. ఆ రెండూ మనిషికి సంప్రాప్తిస్తే నిలువునా మండిపోని నరాధముడెవడూ వుండడు. అందుకే నా అంచనా కరెక్టయింది. మీకు జరిగిన అన్యాయంకూడా సామాన్యమైంది కాదు. అది మీ హృదయాన్ని దహించకుండా వుంటుందని నేను అనుకోను. మననింత అన్యాయం చేసిన వ్యక్తుల్ని మనం సహించి ఎందుకు వూరుకోవాలి? గాజులు తగిలించుకుని మూల కూర్చుంటామా? అన్యాయాన్నెదిరించే ధర్మంలో యెప్పుడూ భగవంతుడుంటాడు" ఉద్రేకంగా అంటున్న ఆమెనే చూస్తుండిపోయాడు కాఫీ కప్పుకూడా అలాగే పట్టుకుని.

"ఐయామ్ సారీ! నాకీ మధ్య ఎందుకో వూరికే ఆవేశం వస్తోంది. ఏమనుకోక కాఫీ త్రాగండి" అంది సర్దుకుంటూ.

సూర్యమిత్ర మాటలు వింటూ అడుగున ఉన్న కాఫీ కాస్తా తాగేసి కప్పు బల్లమీద పెట్టాడు. ఆమె అంతకు మునుపే త్రాగేసింది కాఫీ.

"ఇంతకీ మీరు జైలువిడిచి బయటపడుతూ ఏమనుకుంటూ బయటపడ్డారు?" అని అడిగింది కుతూహలంగా సూర్యమిత్ర.

"భూపాల్‌నిగాని, వరప్రసాద్‌నిగాని చంపా లనుకుంటూ

బయటికి రాలేదు. వాళ్ళకి ఏదో విధంగా బుద్ధిచెప్పాలని, ఓ ఆట ఆడించాలనే భావించి వచ్చాను" అన్నాడు నిదానంగా.

"ఆటా! అలాంటివాళ్ళతో ఆడుకోవడమేమిటి? త్రాచుపాములవి" తీవ్రంగా అంది సూర్యమిత్ర.

"ఆడుకుంటే త్రాచుపాములతో ఆడాలిగాని, వెధవ బురద పాములతో ఏమిటి?" నిర్లక్ష్యంగా అన్నాడు ఉత్తమచంద్ర.

ఆ మాటకి క్షణం అతన్నే పరకాయించి చూసి "అది అసంభవం. వాళ్ళకి తెలిసేట్టుగానో, తెలియకుండానో ప్రతీకారం చేయాలనుకునేకంటే అసలు నేను చెప్పిన మార్గమే సరి అయింది."

"మీ భావనలో మీది సరి అయినదే కావచ్చు. అయినా ఏ విధంగా, ఎక్కడ వాళ్ళని అంతం చెయ్యాలంటారు?" అని అడిగాడు.

"హైదరాబాద్‌లో లేదా ఈ వూరిలో" గంభీరంగా అంది.

"ఈ వూళ్ళోనా?" అన్నాడు ఉత్తమ్ ఆశ్చర్యంగా.

"అవును. ఈ వూళ్ళో ఓ తోట వుంది. ఆ తోటలో బంగళా వుంది. ఆ బంగళాకి అతని ప్రేతం కాపలాకాయాలి ఇకమీదట" అంది వికృతంగా నవ్వుతూ.

ఆ మాటలు వింటూ ఆరడుగుల ఉత్తమ్ గజగజలాడాడు.

"ఈవిడ దేవాంతకురాలు! ఈ బెజవాడ శివార్లో వున్న ఆ తోట-ఆ బంగళాకూడా ఈమెకి తెలిసాయంటే తనకంటే పాతిక ఆకులు ఎక్కువే చదివింది. ఈమె ముందు తనెందుకూ పనికిరాడు" అనుకుంటూ పూర్తిగా నిర్ధారించుకున్నాడు ఉత్తమచంద్ర.

అయిదున్నర అడుగుల ఎత్తువున్న మహాసౌందర్యవతి అనిపించుకున్న సూర్యమిత్ర అతని కా క్షణంలో మణిమస్తకమైన కోడె నాగులా కనిపించింది కాని మానవకాంతలా కనిపించలేదు.

"మీకు తెలుసా అతని బంగళా ఎక్కడో!" అని అడిగింది.

"ఆ మొన్న కాకతాళీయంగా ఆ బంగళాలోనే తుఫానులో తల దాచుకోవలసి వచ్చింది"

"ఏమిటీ! ఆ భీమసింగ్ అక్కడ వున్నాడా?" అని అడిగింది

ఆదుర్దాగా.

"ఆ! అతనే నా కా పూట ఆశ్రయం ఇచ్చింది."

ఆ మాట వింటూ నిట్టూర్చింది. "అయితే ఈపాటికి మీరక్కడికి వచ్చి వెళ్ళారని భూపాల్ కి తెలియచేయబడే వుంటుంది" అంది.

"తెలియనీయండి-ఏం చేస్తాం! అది అతని తోట అని కలగన్నానా?" అన్నాడు విసుగ్గా.

అది గమనించింది ఆమె. "అయితే మీకోసం ఈ ప్రాంతాల కూడా పోలీసులని పెట్టే వుంటాడు. మీ రీ వేషం కాస్త మార్చుకుంటే మంచిది."

"ఏం చేయను?"

"ఓ డ్రామా కంపెనీకి వెళ్ళి ఓ విగ్గు కొనండి. అది పెట్టుకోండి. కళ్ళకి జోడు తగిలించండి. ఇలాగే కొన్ని చిన్న చిన్న మార్పులు చేసుకుంటే మిమ్మల్ని ఎవరూ పట్టుకోలేరు. అప్పుడు మన పని నిర్విఘ్నంగా జరిగిపోతుంది."

"అవన్నీ కొనడానికి నా దగ్గర డబ్బేది? నేనన్నివిధాలా దైన్య స్థితిలో వున్నాను" అన్నాడు దిగులుగా.

"ఆ డబ్బు నేనిస్తాను" అంది లాలనగా చూస్తూ.

"మీకు అనవసరమైన ఖర్చు అది ఒకటా?"

"అది అనవసరపు ఖర్చుకాదు. నాకు అతి ముఖ్యమైన కర్తవ్యం. మీరు పోలీసులకి చిక్కితే ఒరిగేదేముంది?" అంది మెల్లగా.

"సరే! మీరే అవి ఎక్కడ దొరుకుతాయో తీసుకువెళ్ళి కొని పెట్టండి" అన్నాడు లేచి నిలబడుతూ.

అతనికేసి సంతృప్తిగా చూసింది సూర్యమిత్ర.

"అలాగే! మీరు వస్తానంటే ఇప్పుడే వెడదాం."

"మరి డబ్బు."

"అదీ వుంది."

"నేను చెప్పలా! మీరు అంతా పకడ్బందీగా, ముందే ప్లానులు వేస్తుంటారని" అంటూ నవ్వాడు ఉత్తమచంద్ర.

"ఏదో-కాస్తన్నా బుర్ర ఉపయోగించకపోతే ఎలా! అవతలి వారు సామాన్యులు కారుగదా! వాళ్ళనిబట్టి మనం ఫాలో అవకపోతే డామిట్ కథ అడ్డం తిరిగిందన్నట్లు మనం వెళ్ళి జైల్లో కూర్చుంటాము."

"అది మనకి ఎప్పటికైనా తప్పదు!" మెల్లగా అన్నాడు.

"ఎప్పటికో ఫర్వాలేదు. ఆ దుర్మార్గులు చచ్చాక మనం జైల్లో కూర్చున్నా తృప్తిగా బతకచ్చు" అంది సూర్యమిత్ర.

లోపల బీరువాలోంచి డబ్బు తీసి పర్సులో పెట్టుకుని "రండి వెడదాం" అంది. ఆమెని అనుసరించాడు ఉత్తమచంద్ర.

రిక్షాలో డ్రామా కంపెనీల కవసరమయ్యేవన్నీ అమ్మే కొట్టుకు తీసుకు వెళ్ళింది. అక్కడ విగ్గు కొన్నది. ఇవతలకి వచ్చి నల్ల కళ్ళజోడు కొన్నది. అతనికి ఇంటికి వచ్చాక వేపిచూపి "మీరు బెంగాలీ బాబులా పంచె కట్టండి. లాల్చీ వేయండి. పాంటు షర్టు తీసి అవతల పెట్టండి" అంది నవ్వుతూ.

"ఓ.కే! అప్పుడు పేరుకూడా మార్చేస్తాను. చంద్రబాబు అని పెట్టుకుంటాను" అన్నాడు నవ్వుతూ.

ఆ మాటకి సూర్యమిత్ర ముఖం పువ్వులా వికసించింది.

"అవును. ఇంగ్లీషు బాగా దంచండి" అంది నవ్వుతూనే.

"దంచుతాను మేడం. ఇకపై నాపని మీరేది దంచమంటే అది దంచడమేగా!" అన్నాడు చిలిపిగా.

"రైట్! మీరు ఉత్తమచంద్ర. నేను సూర్యమిత్రని. సూర్యచంద్రు లేకం అయితే లోకానికి ఏం వాటిల్లుతుంది."

"అమావాస్య! గాఢాంధకారం" అన్నాడు నవ్వుతూ.

"కరెక్టు! మనిద్దరం గాలీ, వానలా ఏకమై తుఫానులా విరుచుకు పడాలి భూపాల్‌మీద—వరప్రసాద్‌మీద. వాళ్ళ జీవితంలో ఇక అమావాస్య చీకటే తప్ప వెన్నెల రోజులు లేవని ఋజువు చెయ్యాలి."

"ఇవన్నీ మనం అనుకోడానికి బాగానే వుంటాయి. అలా జరిగినప్పుడు కదా ఆనందించేది."

"జరుగుతాయి. మనబోటివారివల్లే జరుగుతాయి. గడ్డిపరక లైనా కట్టగా కట్టి తాడు పేనితే మదపు ఏనుగునయినా బంధిస్తుం దని చిన్నయసూరి వాక్యం—అది మర్చిపోతే యెలా?" అంది చిలిపిగా.

"మొత్తానికి మీరు సార్థకనామధేయురాలు. సూర్య అన్నం దుకు ఆయన కున్నంత తీక్షణతా వుంది మీ దగ్గర."

"మీ దగ్గర మాత్రం లేదూ—చంద్రుని కున్నంత చల్లదనం?" కొంటెగా అడిగింది.

"ఏం చల్లదనమైనా చంద్రుడికి స్వయంప్రకాశం లేదు. సూర్యకాంతి పడితే తప్ప."

"మరే! అందుకేగా నేను మీ పక్కన చేరింది" అంది నవ్వు తూనే.

ఉత్తమచంద్ర లేచాడు. "చాలా చీకటిపడింది. ఇంటికి వెడ తాను."

"ఉండండి. భోజనంచేసి వెడుదురుగాని" అంటూ బలవంత పెట్టింది.

చివరకి తినే బయలుదేరాడు.

"మీరు యే పథకం ఆలోచిస్తారో ఆలోచించి వుంచండి" అన్నాడు.

"అలాగే! వచ్చేవారం—యిదే రోజున యిక్కడికి రండి" అంది సూర్య.

ఒక్క క్షణం తటపటాయిస్తూనే "నా కేదన్నా ఉద్యోగం వుందేమో మీ ఆఫీసులో అడగరాదా?" అన్నాడు ఆశగా.

"అడుగుతాను. ఏ సంగతీ మీకు రేపు సాయంత్రం తెలియ బరుస్తాను."

"అయితే నే నిక్కడికి ఎన్నింటికి రాను?"

"ఆరున్నరకి రండి."

అలాగే నన్నట్టు తల వూపాడు. అతను వెళ్ళేదాకా చూస్తూనే వుంది సూర్యమిత్ర.

అతనింటికి వచ్చాక "ఏరా! నీ కోసం వంట చేస్తిని. అది కాస్త చల్లారేపోయె! ఇప్పటిదాకా ఎక్కడున్నావు?" అని అడిగింది మీనాక్షమ్మ.

"మా ఫ్రెండింట్లో తిన్నాలే!"

"మరి నేను వండిందంతా పారెయ్యనా?" అంటూ లబలబ లాడింది.

"పారేయద్దు పెద్దమ్మా! రేపు పొద్దున్నే లేచి చద్దెన్నం తింటానులే" అంటూ మంచంమీదకి వరిగిపోయాడు. ఆ మాట అన్నాక మీనాక్షమ్మ మనసు కూడా శాంతించి మంచంమీదకి చేరింది.

ఆ మర్నాడు సాయంత్రం సూర్యమిత్ర యింటికి బయలుదేరి వెళ్ళాడు ఉత్తమచంద్ర.

అతను వెళ్ళేసరికి యింటికి వచ్చివుంది ఆమె. అతన్ని చూడ గానే వికసితవదనంతో ఆహ్వానించింది.

"ఏమయింది? నా మాట అడిగారా?" అంటూ కుర్చీలో కూర్చున్నాడు.

"ఆ! అడిగాను. టెంపరరీగా ఓ రెండు మూడునెలలు తప్ప ఇవ్వడం కుదరదు. మా కంపెనీ బ్రాంచి ఒకటి కాకినాడలో ఓపెన్ చేసి అక్కడ వేసే అతని స్థానంలో ఓ రెండు మూడు నెలలు పని చేయవచ్చు అని అన్నారు" అంది సూర్య.

"ఆ తర్వాతైనా కాకినాడలో అవసరం అవరా మనిషి?" కుతూహలంగా అడిగాడు.

"ఎందుకు వుండరు? కావి మా బాస్‌గారి చుట్టాలబ్బాయిని వేసుకుంటారు___" అని జవాబిచ్చింది.

"సరే కానీయి. ఏదో అసలు ఖాళీగా వుండేకంటే ఓ రెండు నెలల జీతం అయినా వస్తుంది" అంటూ అంగీకరించాడు.

"మీ యింట్లో ఎవరూ లేరా?" అని అడిగాడు ఆశ్చర్యంగా.

"ఎవరూ లేరు. నాకు ఒక అక్కయ్య వుంది. అమ్మ వుంది. కావి యిక్కడ మాత్రం ఎవరూ లేరు" అంది ఎటో చూస్తూ.

"అంటే ఏదైనా వూరు వెళ్ళారా?"

"అవును. మా అక్కయ్యతో పల్లెటూరు వెళ్ళారు."

"అందుకే తమ ఇష్టారాజ్యంగా వుంది" అన్నాడు నవ్వుతూ.

"ఏం?"

"మీ అమ్మావాళ్ళుంటే అంత ధైర్యంగా నన్ను యింటికి ఆహ్వానిస్తారా?"

"అదీ నిజమేననుకోండి" అంటూ సన్నగా మందహాసం చేసింది.

"రేపు వుదయం ఆఫీసుకు రానా?"

"రండి! అప్లికేషన్ ఒకటి టైపుచేసి కాని మామూలుగా రాసి కాని ఇవ్వండి. అందులో మీ పేరు చంద్రబాబు అనే రాయండి. ఆ ఉత్తమని తీసి కాసేపవతల పెట్టండి" అంది నవ్వుతూ.

"ఆ పని రాత్రే చేశాంగా! నా రూపం ఎప్పుడయితే మార్చానో నాలోని ఉత్తముడిని కూడా అవలకి నెట్టినట్టే! ప్రస్తుతం నేను సూర్యమిత్రగారి భృత్యుడినే!" అన్నాడు ఉత్తమ్.

"మీ రలా అంటే చెప్పలేను. మనిషికి మనిషిగా సాయపడే వ్యక్తిగా భావించానేగాని మీ రేదో నా సేవకులని అనుకోలేదు. అనుకోను. ఇద్దరమూ ఒక పులివాత పడినవాళ్ళమే! దాన్ని పట్టడానికి ఏకమయ్యామనుకుంటున్నానేగాని మీ రలా అంటారని తెలిస్తే అసలు నే నింతదూరం మీతో చనువు తీసుకునేదాన్ని కాదు" అంది చిన్నబుచ్చుకుంటూ.

అది గ్రహించిన ఉత్తమచంద్ర ఎందుకన్నానా? అని పశ్చాత్తాపపడకపోలేదు.

"ఇంతకీ మీరు భూపాల్‌ని మట్టుపెట్టాలనుకోవడానికి యింత కంకణం కట్టుకోవడానికి అంత దారుణంగా ప్రవర్తించాడా?" అని అడిగాడు కుతూహలంగా.

"మీకు నా కధ వినాలని కుతూహలంగా వున్నదా?" అని అడిగింది గంభీరంగా.

"అది సహజం. మనిద్దరం ఆంతరంగిక మిత్రులం అనుకుంటే నా మీద నమ్మకం వుంటే చెప్పండి. నా బతుకెలాగో మీకు తెలియనే తెలుసుగా!"

"దయచేసి నన్ను సూర్యా అనిగాని మిత్రా అనిగాని పిలవండి. మీరు అనవద్దు."

"అలాగే; మీ కండిషన్ల నెప్పుడు వ్యతిరేకించాను గనుక."

"నేను యిప్పటి కిప్పుడు క్షణాలమీద మిమ్మల్ని కూర్చో బెట్టి చెప్పలేను; ఈ రాత్రికి నా కథనంతా కాగితాలమీద పెట్టి ఇస్తాను. సావకాశంగా చదువుకోండి" అంది సన్నగా నవ్వుతూ.

"ఓ.కే; మరి వెళ్ళిరానా?"

వెళ్ళమన్నట్టు తల వూపింది. ఉత్తమచంద్ర ఇంటికి వెళ్ళి పోయాడు.

ఆ మర్నాడు ఆమె పనిచేసే కంపెనీకి వెళ్ళాడు. టెంపరరీ ఉద్యోగం సంపాదించాడు.

చిన్నదో—పెద్దదో. నెల చేసినా రెండునెలలుచేసినా ఉద్యోగం అంటూ వుంటే మనిషికి అదో విధమైన ఆత్మవిశ్వాసం ఏర్పడు తుంది. క్షణకాలో తను జైలునించి పారిపోయి వచ్చానని—తన కోసం భూపాల్, పోలీసులు అంతా వెతుకుతున్నారని—అన్నీ మర్చి పోయాడు. ఎంతో విశ్రాంతగా నిద్రపోయా డా రాత్రి.

తెల్లవారిన దగ్గరనించీ అతనికి తహతహగానే వుంది సూర్య మిత్ర కుటుంబాన్ని గురించి—ఆమెకు జరిగిన అన్యాయాన్ని గురించి తెలుసుకోవాలని. అందుకే ఆమెకంటే ముందే వచ్చాడు ఆఫీసుకు. ఆమె మటుకూ కరెక్టు టైముకే వచ్చింది.

"రాశావా మిత్రా?" అని అడిగాడు.

"రాశాను. కాని మీ ధోరణిచూస్తే యిక్కడే చదివేట్టున్నారు. అందుకే యిప్పుడివ్వను. సాయంత్రం వెళ్ళేప్పుడు ఇస్తాను" అంది గడుసుగా.

ఆమె మాటకి తిరుగులేదు కనుక చివరికలాగే సాయంత్రవే ఆ కాగితాలు తీసుకుని యింటికి వెళ్ళిపోయాడు ఉత్తమచంద్ర.

## 6

ఇంటికి వెళ్ళి మంచంమీద వాలి కాగితాలు విప్పదీశాడు అదంతా ఓ కథలానే రాసింది సూర్యమిత్ర. మెల్లగా చదవసాగాడు.

"ఏ ఒక్కరి జీవితాలూ, ఎప్పుడూ ఒక్కలాగే సాగవు. ఒకప్పుడు లక్షాధికారి అనుకున్న వ్యక్తి బికారి కావచ్చు. ఎందుకూ పనికిరానివాడు అని తిట్టుకున్న వ్యక్తి ఓ పెద్ద మంత్రిగారైపోవచ్చు. ఇవన్నీ కాలం తెచ్చే మార్పులు. ఆ మార్పులకి ఎలాంటివారైనా తల వంచినట్టే మేమూ వంచాము.

పరంధామయ్యకి ఇద్దరే ఆడపిల్లలు. ఒకమ్మాయి భానుప్రభ, రెండో అమ్మాయి సూర్యమిత్ర.

మాధవ అండ్ కోలో ఎకౌంటెంట్‌గా పని చేస్తూండేవాడు పరంధామయ్య. మగపిల్లలు లేరే అన్న బాధ తప్ప మరే విధంగానూ చింతలేని కుటుంబం. ఆడపిల్లలు గదాని యేమీ లోటు చేయకుండా చదువుకుంటా నన్నంతవరకూ చదివించాడు.

బి. ఏ ప్యాసయింది భానుప్రభ. బి. కాం. చదువుతోంది సూర్యమిత్ర.

"బి.ఏ. చదివాను గదా నాన్నా! కొన్నాళ్ళెక్కడన్నా ఉద్యోగం చేస్తాను" అంది భాను.

"నీ యిష్టం" అన్నాడు పరంధామయ్య.

అప్పుడే "ప్రసాద్ కార్పొరేషన్" అన్న ఆఫీసులో ఉద్యోగ ప్రకటన చూపి అప్లయ్ చేసింది భానుప్రభ.

హైదరాబాద్ ఇంటర్వ్యూకి ఆహ్వానించారు. తండ్రిని తీసుకుని వెళ్ళింది. ఉద్యోగంలో ఇంటర్వ్యూ అయ్యాక "ఓ రోజు ఇక్కడే వుండండి. రేపే సెలక్షన్" అన్నాడు వరప్రసాద్.

ఆ పూట అక్కడే వుండిపోయారు ఆ వూరులో కాస్త అటూ యిటూ తిరిగి ఒకవేళ ఉద్యోగం వస్తే యెక్కడ వుండ వచ్చోనని చూసుకుంటూ. అనుకున్నట్టుగానే భానుప్రభ సెలక్టయింది. ఆమె ఆనందానికి మితిలేదు. తను పెట్టిన మొదటి దరఖాస్తుకే ఉద్యోగం రావడం.

ఎంతో అదృష్టం అని పొంగిపోయింది. ఆమే కాదు. అంతా అదే అన్నారు.

కూతురికోసం తన ఉద్యోగం పోగొట్టుకోవడం ఇష్టంలేదు

పరంధామయ్యకి. పైగా పైనలియర్ బి. కాం. చదువుతున్న సూర్య మిత్ర వుంది. చివరికి ఆమె నొక్కత్తినే వుంచారు హైదరాబాద్‌లో.

కొత్త వూరు. కొత్త ఉద్యోగం. అన్నీ సంతోషంగానే వున్నాయి భానుప్రభకి.

భానుప్రభ స్వతహాగా చురుకైంది. ఒకసారి పని చెబితే చాలు. అలా అల్లుకుపోయే రకం—ఆమె చురుకుతనం, తెలివి తేటలు బాగా ఆకర్షించిన వరప్రసాద్ వచ్చిన నెలకే కన్‌ఫరమ్ చేసి జీతం పెంచాడు.

ఆ రోజు—వరప్రసాద్ మద్రాసు వెళ్ళాడు—అందుకని ఆయన స్థానంలో భూపాల్ వచ్చి కూర్చున్నాడు.

సరిగ్గా పదయ్యేసరికి ఆఫీసులో అడుగు పెట్టిన భానుప్రభని గ్లాస్ డోర్స్‌లోంచి చూచిన భూపాల్ క్షణం మతిపోగొట్టుకొన్నాడు. అబ్బ! ఇంత అందమైన పిల్ల తన ఆఫీసులో పని చేయడం తన అదృష్టం అనుకున్నాడు. అంత చక్కని పిల్లని సెలక్షన్ చేసిన తండ్రిని మనసారా అభినందించాడు.

ఆమె వచ్చిన పావుగంటకి తన గదిలోకి పిలిపించాడు. టేబుల్‌మీద వున్న లెటర్ చూపించి "దీనికి రిప్లయ్ వెళ్ళిందా?" అని అడిగాడు భూపాల్.

ఆ మాటలకి కిలకిలా నవ్వింది భాను.

"దానికి రిప్లయ్ కాదు—సరుకు కూడా వెళ్ళిపోయింది," అంది.

"అయితే చాలా క్విక్‌గా చేసేస్తారన్నమాట?" అన్నాడు ఆశ్చర్యంగా.

"అవును. సరుకు వున్నప్పుడు వెంటనే పంపేస్తే అవతల వారికి గుడ్ ఇంప్రెషన్ వుంటుంది. మరోసారి కాస్త సరుకు లేక లేటయినా ఓపికపడతారు" అంటూ నిర్భయంగా జవాబిచ్చింది.

ఆమె మాటలు వింటూ సంభ్రమంగా చూశాడు.

"మొత్తానికి చాకులాంటి పిల్ల. ఇంత శ్రద్ధగా కంపెనీపట్ల ప్రవర్తిస్తుంటే, ఎవరికి ఆనందం వుండదు?" అనుకున్నాడు.

"మొత్తానికి నువ్వు చాలా తెలివైన దానివిలాగా కనిపిస్తున్నావు. ఇకనించి నువ్వు నా పర్సనల్ అసిస్టెంటుగా వుండు" అన్నాడు కలువరేకుల్లాంటి ఆమె కళ్ళల్లోకి చూస్తూ.

ఆ మాటకి పొంగిపోయింది భానుప్రభ. ఆమె ముఖంలో కోటి భానుప్రభలు వెల్లివిరిసాయి.

రాజు తలకుంచే దెబ్బలకి కొదవాని భూపాల్ తలచుకుంటే దానికి తిరుగేముంది? ఆ మర్నాడే ఆమె సీటు మారిపోయింది. గ్లాస్ డోర్స్, మధ్య భూపాల్‌కి కాస్త పక్కగా ఆమె కుర్చీ, టేబులు వెలిశాయి. దాంతోపాటు జీతమూ పెరిగింది. జీతంతోపాటు వేషమూ మారుతుంది. మంచి మంచి చీరలు కొనుక్కుంది. తనేమీ యింటికి డబ్బు పంపాల్సిన పనిలేదు. అయినా తండ్రి మాట ప్రకారం తన ఖర్చులు పోను—మిగిలింది బ్యాంక్‌లో దాచుకుంటూ తీయగా దొర్లించసాగింది రోజుల్ని.

గులాబిరంగు శరీరచ్ఛాయా, కలువరేకుల్లాంటి పెద్ద కళ్లూ, ఒడ్డు—పొడవు సమానంగా వుండే భానుప్రభ అందగత్తెనని ఒప్పుకోక తప్పదు. అసలే ఆడపిల్ల పేరు చెబితేనే అయిస్ అయ్యే భూపాల్ ఆమె అందానికి—తెలివితేటలకి—చలాకీతనానికి వెర్రెత్తిపోయాడు.

బంజారాహిల్స్‌లో అతనికి చక్కని బిల్డింగ్ వుంది.

"చూడు మిస్ భానుప్రభా! ఈవెనింగ్ ఇంపార్టెంట్ లెటర్స్ వుంటే తీసుకుని మా బిల్డింగ్‌కి రా! నేను వేరే పనిమీద వెళ్ళి యింటికి వెళ్ళిపోతాను. ఇటు రాను" అన్నాడు ఆ పూట వచ్చీ రాగానే.

"అలాగే" అన్నట్టు తల వూపింది. ఇంటి అడ్రసు చెప్పి, గుర్తులు చెప్పి కారులో వెళ్ళిపోయాడు. ఆ పూట పని అంతా ఆమే చూసుకుంది. అతనన్నట్లుగానే ఇంపార్టెంట్ లెటర్స్ మూడు వచ్చాయి. అవి తీసుకుని బంజారాహిల్స్‌లోని అతని యింటికి వెళ్ళింది.

అతను బాల్కనీలో నిలబడి ఆమె కోసమే యెదురు చూస్తు

న్నాడు. ఆమెని చూడగానే గబ గబా అతనే క్రిందకి దిగివచ్చాడు.

అతన్ని చూస్తూనే ఆమె నమస్కారం చేసింది. అతను చిరునవ్వు నవ్వుతూ ఆమెని లోపలకి తీసుకువెళ్ళాడు. అఫీసుకు వచ్చేప్పుడు అతను వేసే ఫుల్ సూటులో కాక తెల్లని గ్లాస్కో లాల్చీ, పైజామాలో ఎంతో ఆకర్షణీయంగా వున్నాడు.

ఆ భవనం కవులు వర్ణించే ఇంద్రభవనంలా వుంది. మొజాయిక్ ఫ్లోరింగ్—కిటికీలకు తలుపులకు రంగు రంగుల కర్టెన్స్. సన్‌గ్లాస్ ఛైర్స్—స్టీలు టేబుల్స్—సన్‌గ్లాస్ టేబుల్స్—సోఫా కంబెడ్స్, అంతా ఏదో ఖరీదైన సినిమా సెట్టింగ్‌లా కనిపించిందామె కళ్ళకి.

"అందమంతా ఈ ప్రపంచంలో డబ్బుతోనేగదా వుంది!" అనుకుంది ఆశ్చర్య విస్ఫారిత నేత్రాలతో అతను చూపించే ప్రతి గదినీ పరిశీలిస్తూ.

అన్నీ చూపించి అతను తన గదిలోకి తీసుకువెళ్లాడు. టిఫిన్ పట్టుకు రమ్మని నౌకరుకు పురమాయించాడు.

"ఎలా వుంది మా యిల్లు?" అని అడిగాడు నవ్వుతూ కూర్చుంటూ.

"బ్రహ్మాండంగా వుంది. ఇంతకీ మీ మిసెస్‌గారిని పరిచయం చేయరేం! అంత ఘోషానా?" అని అడిగింది నవ్వుతూ.

"ఆ మిసెస్ ఎవరయిందీ తెలియకనే ఆగిపోయింది!" అన్నాడు నవ్వుతూ.

"అంటే...." అంది అర్థోక్తిలో.

"నీలాగే నేను ఒంటరిగాడిని" అన్నాడు.

"మీకేం తక్కువ! మీరు వివాహం చేసుకోవచ్చునే!" అంది విచిత్రంగా చూసి.

"నీకుమాత్రం ఏం తక్కువ? నువ్వెందుకు పెళ్ళి చేసుకోలేదు?" ఎదురుప్రశ్న వేశాడు.

"నాకు ఉద్యోగంమీద మనస్సుపుట్టి పెళ్ళి వాయిదా వేశాను. అయినా నేను మెచ్చే, నన్ను వరించే మగవాడు దొరకాలిగా!"

"నా కేసూ అదేగా! నేను కోరిన నా మనస్సు నాక్రమించిన మగువ దొరకాలి. అప్పుడే పెళ్ళి" అంటూ నవ్వాడు. ఇంతలో టిఫిన్లు వచ్చాయి.

"తీసుకో!" అంటూ తనే ఆమెకి అందించాడు. అలా అందిస్తూ చెయ్యి తగిలించాడు. ఆ స్పర్శకు ఝల్లుమంది భానుప్రభ కన్నె హృదయం. తలవంచుకుని టిఫిన్ చేయసాగింది. అది పూర్తిచేసే సరికి కాఫీకూడా తనే అందించాడు భానుకి. అతని చర్యలామె నెంతో పులకితురాలిని చేశాయి.

కాఫీ అయ్యాక "ఇవిగో లెటర్స్" అంటూ చూపించింది. విప్పి చదివాడు.

"వాటికి సమాధానాలు చెబితే రేపు రాసి పోస్టు చేస్తాను."

"చెబుతాను—రాయి" అంటూ పాడ్ అందించాడు.

అతను చెప్పే దంతా షార్టు హ్యాండ్‌లో రాసుకొంది భానుప్రభ.

"ఇంక వెడతాను" అంటూ లేచింది.

అతను వాచీకేసి చూసి "ఈ పూట యిక్కడ భోజనం చెయ్యి. సెకండ్ షో పిక్చర్‌కి వెళ్ళి వద్దాం...." అన్నాడు భూపాల్.

"ఇప్పుడెందుకు లెండి" అంది మొహమాటంగా.

"బలేదానివే! నువ్వు వస్తావన్న ధీమాతో టిక్కట్లు కూడా తెప్పించాను" అంటూ బట్టలేసుకుంటూంటే తప్పదన్నట్లు లేచింది భాను.

"టాయ్‌లెట్ అవుతావా?" అంటూ చూపించాడు అన్నీ.

అయిదు నిముషాల్లో రెడీ అయింది. అతనితోపాటు కారులో కూర్చుని సినిమాకి వెళ్ళడం థ్రిల్లింగ్‌గా వుంది ఆమెకి. థియేటరులో అతని ప్రక్కన కూర్చుంటుంటే ఆమె ఒళ్ళు పులకించింది. బుగ్గలు సిగ్గుతో ఎఱ్ఱబడ్డాయి. అతను ఆమె భుజంమీద చెయ్యివేసి ఎవరూ చూడకుండా ఆమె బుగ్గమీద ముద్దుపెట్టుకుని 'అందాల సుందరిపోటీ

.పెడితే నువ్వే ఫస్టువస్తావు. నిజంగా నీలాంటి సౌందర్యవతి పి.ఏ. కావడం నా అదృష్టం" అన్నాడు భూపాల్. ఆ సౌందర్య ప్రశంసకు కడలిలా పొంగింది భానుప్రభ హృదయం-ఆమెకి ఏమనడానికీ తట్టక అలాగే సినిమాకేసి దృష్టి సారించింది. సినిమా మీద దృష్టివున్నా పదేపదే అతనిమాటే ప్రతిధ్వనించి గిలిగింతల్లు పెడుతోంది ఆమెకు.

ఇంట్రవెల్‌లో ఎన్నో ఇప్పించాడు. ఆమె చివరకి తినలేక పోయింది. అది చూసి "నిన్ను పెళ్లాడినవాడికి అంతా ఆవాయే ప్రభా!" అన్నాడు చిలిపిగా ఆమె కళ్ళల్లోకి చూస్తూ.

"మీరేమన్నా అనుకోండి. నేనుమాత్రం ఇన్ని తినలేను" అంది భానుప్రభ. మిగిలిన సినిమా అంతా ఆమె చెయ్యి తన ఒడిలో పెట్టుకునే కూర్చున్నాడు భూపాల్. ఆమె సిగ్గుతో మొగ్గలా ముడు శించుకుంటూ ఒదిగి కూర్చుంది. సినిమా పూర్తి అయ్యాక "మీ ఇల్లు ఎక్కడ?" అని అడిగాడు ఆమెను దగ్గరగా కూర్చోపెట్టుకుంటూ.

చెప్పింది. ఆటో పోనిచ్చి ఆమె ఇంటిదగ్గర ఆపి ఆమెతో పాటు లోపలకి వెళ్ళాడు.

"నీ యిల్లు చిన్నదయినా నీట్‌గా వుంది ప్రభా!" అన్నాడు ఆమెని దగ్గరకు తీసుకుంటూ.అంతవరకూ పురుషస్పర్శ ఎరగని ఆమె హృదయం అతని చేతిలో అవశమైపోయింది. అది గమనించి మరింతగా కౌగలిలో నలిపివేయసాగాడు.

"ప్లీజ్. వదలండి" అంది కంఠం పెగల్చుకుని.

"వదలలేను ప్రభా! నీ అందం నన్ను వెర్రివాడిని చేస్తోంది. నీ మీదగల ప్రేమ నన్ను ఎక్కడా నిలబడనీయడంలేదు. ప్లీజ్ ప్రభా! నా మనసులో నీ మనసు కలుపు. మన తనువులు ఏకమవనీ! అప్పుడు గాని నా హృదయారాటం తగ్గదు" అంటూ ఆవేశంగా అందినచోటల్లా ముద్దులు పెడుతుంటే ఉక్కిరిబిక్కిరి అయిపోతోంది భానుప్రభ.

మెల్లగా ఆమెని మంచంమీద కూర్చోపెట్టి పక్కన కూర్చున్నాడు. అది చూసి కాస్త వణికింది.

"నాకిలాంటివన్నీ పెళ్ళికాకుండా ఇష్టం వుండవు" అంది అతను చొరవతీసుకుంటూ వుంటే.

"నేను నిన్ను తప్పకుండా పెళ్ళి చేసుకుంటాను" అంటూ ఆమె చేతిలో చెయ్యివేశాడు భూపాల్.

"అయితే అందాకా ఓపిక పట్టలేరా?" అంది నవ్వుతూనే.

"అందాకా ఆగలేను. ఈ అందం ఏ క్షణాన ఎవరి స్వంతం అయిపోతుందోనన్న భయం నా నరనరంలోనూ వుంది. అందుకే నేనింత ముందడుగు వేసింది."

"నేను మాట అంటే తప్పేదాన్ని కాను. మీరెలా మనసులో నన్ను ప్రేమిస్తున్నారో అంతకు పదిరెట్లు నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. దయచేసి పెద్దల అనుమతి తీసుకుని పెళ్ళి అయితే మీకు ఏ క్షణంలోకూడా అభ్యంతరం చెప్పను" అంది బేలగా అతనికేసి చూపి.

భూపాల్ ఆమెకేసి ఓసారిచూసి అప్పటికి వదిలి బయటవున్న తన కారులో కూర్చుని స్టార్టు చేశాడు. అతను వెళ్ళిపోతుంటే గుమ్మంలో నిలబడి చూస్తుండిపోయింది భానుప్రభ.

అతనికేమన్నా కోపం వచ్చిందేమో అనుకుంటూ ఆ రాత్రి తెల్లవార్లూ కంటిమీద కునుకులేకుండానే గడిపింది భాను. తెల్లవారి బెదురుతూనే ఆఫీసుకు వచ్చింది. అతనింకా అప్పటికి రాలేదు. కూర్చుని తన పని చూసుకోసాగింది. అరగంటకి ఎవరితోనో కలిసి వచ్చాడు భూపాల్ ఆఫీసుకి.

అతనికి కాఫీ తెప్పిస్తూ తనకీ కాఫీ తెప్పించేసరికి కాస్త మనస్సు శాంతించిందామెకి. పైగా రాత్రి ఏం జరగనట్టే మామూలుగా ప్రవర్తిస్తుంటే చాలా సంతోషించింది.

'ఇతను పాపం చాలా మంచివాడు. తనే అనవసరంగా అపోహపడింది' అనుకుంది కరిగిపోతూ.

"భానూ! సాయంత్రం బట్టలకొట్టు దగ్గర వుండు" అంటూ పేరు చెప్పాడు.

భానుప్రభ ముఖం ఇంత అయింది. అలాగే నన్నట్లు తల వూపింది. సాయంత్రం అతను ముందే వెళ్ళిపోతూ "తప్పకుండా అక్కడ వెయిట్ చెయ్యి. నేను బయట పని చూసుకుని వస్తాను"

ంటూ చెప్పి వెళ్ళాడు.

ఆ సాయంత్రం తను ఇంటికి వెళ్ళి చీర మార్చుకుని అతను ప్పిన బట్టలకొట్టు దగ్గర నిలబడింది. ఆమె వెళ్ళిన అయిదు నిముషా కే వచ్చాడు భూపాల్. లోపలకి తీసుకువెళ్ళి మంచి ఖరీదైన చీరలు ండు, వాటిమీదికి జాకెట్ పీసులు కొని ఆమెకి అందించాడు. రులో ఆమెని హోటల్‌కి తీసుకువెళ్ళి కడుపునిండా టిఫిన్ పెట్టించి ంటి దగ్గర దింపి తను దిగకుండానే అలా కారులోంచే టాటా ప్పాడు. దాంతో అతనిమీద మరింత జాలి పుట్టుకు వచ్చింది భానుకి.

"అతనికి నేనంటే నిజంగా ప్రేమ వుంది" అనుకుంటూ రవశించిపోయింది. ఆ చీరలని ముద్దుపెట్టుకుని పెట్టెలో దాచుకుంది. ఫిన్ బాగా పట్టించింది కనుక ఆకలి లేదు. అది లేకపోతే పెద్ద ని వుండదు. చీర మార్చుకుని హాయిగా మంచంమీద వాలి యింది. ఆమె కళ్ళముందు భూపాల్ ప్రత్యక్షమయ్యాడు. భూపాల్ నని నిజంగానే ప్రేమిస్తూ వుండివుండచ్చు. ఆ మాటలో అబద్ధం మీ లేదు. అదే నిజమైతే తనంత అదృష్టవంతురాలీ ప్రపంచంలో రెవరూ వుండరు. చక్కని అనురాగవంతుడైన భర్త. జమీందారు ను తలదన్నే ఐశ్వర్యం. పేలస్‌లాంటి ఆ యింటికి తను అధికారిణి వుతుంది! ఈ విధమైన తీపి కలలతో తన అదృష్టానికి తను ఙిపిపోతూ హాయిగా నిద్రపోయింది. ఆ నిద్రలో భూపాల్ కని ంచి గిలిగింతలు పెట్టాడు తెల్లవార్లూ.

తెల్లవారి లేచి తలంటుకుని రెండు జడలు అల్లుకుని అతను చ్చిన చీరల్లో ఒకటి కట్టుకుని భూలోక రంభలా తయారై ఆఫీసుకు చ్చింది. ఆమె అలా వెళ్ళి కూర్చున్న అయిదు నిముషాలకే వచ్చాడు పాల్.

సిగ్గు దొంతరలమధ్య అప్సరసలా కూర్చున్న ఆమెని చూసే రికి అతనికి మతిపోయిందనే చెప్పాలి. ఇలాంటి సౌందర్యవతిని హిస్తూ కూర్చోవడం అంత తెలివితక్కువ పని మరొకటి లేదని ంటనే అనుకున్నాడు. అందరిలాగా ఈమె కబుర్లకి బోల్తాపడే కంలా కనిపించలేదు. వెరీ స్ట్రిక్ట్ అని ముందే అనుకున్నాడు.

అందుకే ఇలాంటి పెంకి గుఱ్ఱాలని ఎలా లొంగదియ్యాలో తను రా
వించి ఆలోచిస్తూనే వున్నాడు. ఆ ప్రకారమే తను నడవాలి అ
కుంటూ ఒక్క అరగంట ఆ కౌగిలాలూ ఈ కౌగిలాలూ పరిశీలిస్తున్న
పరిశీలించి "అబ్బ! భానూ తలపోటుగా వుంది. నేను ఇంటికి వె
తున్నాను. మధ్యాహ్నం వస్తానులే" అంటూ కారులో వెళ్ళిపోయాడు
భానుప్రభ మనస్సు చివుక్కుమంది. తనింత కష్టపడి అలంకరించుకు
వచ్చినందుకు అతన్నించి ప్రశంసా వాక్యమురాకుండానే, ఏ షే
కోలూ లేకుండానే అతనికి తలనెప్పి పట్టుకుని వెళ్ళిపోవడం చా
బాధగా తోచింది. ఛీ వెధవ తలనెప్పి! ఈ ఆఫీసులో ఇంతమం
వుంటే ఎవరికీ రాక తన భూపాల్‌కే రావాలా? అనుకుంది తిట్టుకుంటూ
ఆ మధ్యాహ్నం తలనెప్పి తగ్గి అతను రావాలని కోరుకుంది. శతకో
దేవతలకి మొక్కుకుంది.. చివరకి ఏ దేవతా కరుణించలేదు కాబో
భూపాల్ అసలు రానేలేదు.

ఇంక వుండబట్టలేక సాయంత్రం తనే వెళ్ళింది అత
ఇంటికి. ఆమె వెళ్ళేసరికి అతను బయట లాన్‌లో పచార్లు చేస్త
న్నాడు. ఆమెని చూడగానే మందహాసంచేసి "శ్రమ తీసుకుని ఇం
దూరం వచ్చావా?" అని అడిగాడు.

"శ్రమేముందిగాని, మీ తలపోటు తగ్గిందా?" అని అడిగిం
ఆదుర్దాగా!

"ఇప్పుడే కాస్త ఇలా ఇవతలకి వచ్చాను ఇప్పటిదా
పడుకుని" అంటూ లోపలకి దారితీశాడు.

ఎత్తుగా, ఠీవిగా, బలంగావున్న అతన్ని చూస్తూ మైమర
పోయింది భానుప్రభ. ఆమె కంటికి ఆ క్షణంలో అతను పైనిం
దిగివచ్చిన నలకూబరుడులానే కనిపించాడు. ఇంత అందగాడు తన
కాబోయే పతిదేవుడు, తనని వలచిన మన్మధుడు అని అనుకోగా
ఆమె బుగ్గల్లోకి వెచ్చని ఆవిరి వచ్చేసింది.

లోపలికి రాగానే టిఫిను, కాఫీ తెప్పించాడు. ఆమెతోపాటే
తనూ తీసుకున్నాడు.

"అర్జెంట్ లెటర్స్ ఏమన్నా వున్నాయా?" అని అడిగాడు.

"ఆ వున్నాయి" అంటూ తీసింది ఫైల్లోంచి.

అవి అందుకుని సంతకాలు పెట్టి "రేపు పంపవచ్చులే! ప్పటి కిప్పుడేం తొందరలేదు" అంటూ ఆమెకి అందించాడు.

అవి అందుకుని మళ్ళీ ఫైల్లో పెట్టుకుంది.

"ఈ పూట ఇక్కడే భోజనం చెయ్యి"

"మీ నాన్నగారు లేరా?"

"లేరు. మద్రాసు వెళ్ళారు" అని జవాబిచ్చాడు.

కాసేపతను టేప్‌రికార్డర్ తీపిపెట్టాడు. అతని కిష్టమైనవన్నీ ందులో రికార్డు చేసుకున్నాడు. ఆ పాటలు ఆమెకీ ఇష్టమైనవే. ంతో ఉత్సాహంగా విన్నది. ఇంతలో ఏడున్నర అవనే అయింది.

వంట అయిందంటూ చెప్పి వెళ్ళాడు వంటమనిషి.

"భోజనం చేద్దాం రా భానూ!" అంటూ ఆమెని డైనింగ్ బుల్ దగ్గరికి తీసుకువెళ్ళాడు. వంటమనిషి ఇద్దరికీ వడ్డించాడు. జనం చేస్తూన్నంత సేపూ ఆలోచిస్తూనే వున్నాడు భూపాల్. మెని ఈ రాత్రికి ఇక్కడ వుంచడం ఎలాగాని.

"భానూ! ఈ పూట ఇక్కడ వుండిపో! ఇంత చీకట్లో ఎలా ళతావు" అన్నాడు భూపాల్.

"ఫర్వాలేదు. ఆటోలో వెళ్ళిపోతాను."

"నా ముఖం కదూ! ఆ ఆటో మరోదారి పట్టించి నిన్ను త్తుకుపోతే ఏం చేస్తావు? మరేం ఫర్వాలేదులే. ఆ గెస్ట్ రూంలో డుకో" అన్నాడు నచ్చచెబుతూన్నట్టు.

ఒక్కక్షణం ఆలోచించింది భానుప్రభ. లోపల తలుపు డియ వేసుకుంటే అతనెలా వస్తాడు? అనుకుంటూ చివరికి అంగీక రించింది.

గెస్టు రూం శుభ్రం చేయించి ఆమెని అందులో పడుకోమని ప్పి తను తన రూమ్‌కి వెళ్ళిపోయాడు భూపాల్. మెత్తని పరుపు ద వాలగానే ఆమెకి నిద్ర ముంచుకు వచ్చింది. భుక్తాయాసం, ల్లని గాలి, పగలంతా పడిన శ్రమ అవన్నీ ఆమెని వెంటనే కొట్టి నిద్ర పుచ్చాయి. వంటమనిషి పని పూర్తి చేసుకుని ఎప్పుడు

ఇంటికి వెళ్ళిపోయాడో ఆమెకే తెలియదు. ఒక రాత్రివేళ మెలకు వచ్చిన ఆమెకి సన్నగా ఎవరో తలుపు తట్టినట్టయి ఉలిక్కిప తలుపు తెరిచింది. ఎదురుగా భూపాల్.

"ఏమిటి భానూ! అంత గావుకేక పెట్టావు? పీడ కలేమనా వచ్చిందా? లేకపోతే ఎవరన్నా వచ్చారా?" అని అడిగా ఆశ్చర్యంగా.

ఆ మాటకి తెల్లబోయింది భానుప్రభ. తను గావుకే పెట్టిందా? ఏమో! తనకే తెలియదే అనుకుంటూ "ఏమో, అరి నట్టు నా కెక్కడా గుర్తు లేదు" అంది.

"భలేదానివే! నువ్వు అరవబట్టే నేనిలా కంగారుగా వచ్చాన నీకంత భయంగా వుంటే నా గదిలోకి రా."

"ఎందుకు? వద్దులెండి" అంది.

"నీకు అన్నింటికీ భయమే. ఇంతట్లోకి నిన్నేమన్నా నమి మింగుతానా?" అని అడిగాడు కినుకగా.

"అదికాదు. ఎలాగో ఒంటిగంట అయిందికదాని" అంట వాచీ చూసుకుంటూ నపిగింది. ఈలోగా తలుపు గడియ వే భూపాల్. ఆమెకి చేరువగా వచ్చి తటాలున ఆమెని దగ్గర లాక్కుని "పోనీ నేనే నీకు సాయం ఇక్కడ పడుకుంటానులే అన్నాడు రెండు బుగ్గలూ ముద్దులతో ముంచెత్తుతూ.

ఆ వర్షంలాంటి ముద్దులలో, ఆతని వుక్కు కౌగిలిలో వూ రాదలేదు భానుప్రభకి. మెల్లగా ఆమెని మంచం చేర్చాడు.

"ప్లీజ్! మీకు మొన్న నొకసారి నా అభిప్రాయం తెలిపాను అంది మెల్లగా తన మీదకు వాలుతున్న అతన్ని వారించడా ప్రయత్నిస్తూ.

"నిన్ను నేను పెళ్ళి చేసుకుంటానని చెప్పాను. నా మీ నమ్మకం లేకపోతే ఈ ఉంగరం తొడుగుతాను. మనకి గాంధ వివాహం జరిగినట్టే" అంటూ తన వేలికి వున్న డైమండ్ ఉంగర ఆమె వేలికి తొడిగాడు.

ఆమె ఆ వుంగరంకేసి దృష్టి సారించింది. ఆ కాస్త సమయ

చాలు అతనికి వీలు కలగడానికి. అతని ఆవేశం-ఉద్రేకం-కాంక్ష అన్నీ గమనించి అతన్ని వారించడం తనకి శక్తికి మించిన పని అని గ్రహించి అతనికి లొంగిపోయింది భానుప్రభ. ఆమె ప్రతిఘటించక లొంగిపోవడంతో చంద్రమండలం చుట్టివచ్చినంత ఆనందం కలిగింది భూపాల్‌కి. పెంకిఘటాన్ని లొంగదీశాను గదాన్న ఆనందంతో ఒకటికి పదింతలయ్యాడు. ఆ రాత్రి అతను కోరుకున్న సౌఖ్యం లభించింది. ఆశించిన మగువ చేత చిక్కింది. అతనికి కావలసిందేముంది? తెల్లవార్లూ ఆమె పక్కనే పవళింపు సేవ చేశాడు భూపాల్.

తెల్లగా తెల్లవారి పిగ్గుబరువుతో తడబడే అడుగులతో మెల్లగా లేచి వెళ్ళిపోయింది తన ఇంటికి. ఆ రోజే తండ్రికి వుత్తరం రాసింది తనూ, తన కంపెనీ డైరెక్టరు వివాహం చేసుకోబోతున్నట్టు.

ఆ వుత్తరం చదివి కూతురి అదృష్టానికి పొంగిపోయాడు పరంధామయ్య. అక్కకి కంగ్రాచ్యులేషన్స్‌తో ఉత్తరం రాసింది సూర్యమిత్ర.

# 7

అందం, యవ్వనం, చురుకుదనం అన్నీ మూసబోసుకున్న వయ్యారి భానుప్రభ అతనికి కనువిందు చేస్తుంటే రోజుకు ఒకసారి ఆమె ఇంటి దగ్గరో, తన ఇంటిదగ్గరో ఆమెని అనుభవిస్తూనే వున్నాడు భూపాల్.

"మన పెళ్ళి ఎప్పుడు?" అని ఆమె అడిగి నప్పుడల్లా

"మనం రహస్యంగా ఏనాడో దంపతులమయ్యాము. ఇంక పదిమంది ఎదుటా ఆర్భాటాలేగా. చేద్దాంలే నాన్నని రానీ!" అంటూ జవాబిస్తున్నాడు భూపాల్.

అలా ప్రశ్నోత్తరాల మధ్య ఓ నెల గడిచిపోయాక హఠాత్తుగా వూడిపడ్డాడు తండ్రి వరప్రసాద్.

అతని రాకకు ఎక్కువ ఆనందించింది భానుప్రభ. ఇంక భూపాల్ అతనితో చెప్పి తనని ఆ యింటి కోడలిగా తీసుకుపోతాడని పొంగిపోయింది. ఓ వారం గడిచినా భూపాల్ వరప్రసాద్‌తో తన

సంగతి ఏమీ చెప్పకపోవడంతో ఆమెలో తొలిసారిగా అనుమాన బీజం మొలకెత్తింది.

"మీరు మీ నాన్నగారితో చెప్పే వుద్దేశంలో లేరు. అందుకే ఇలా కప్పదాటు వేస్తున్నారు" అంది కినుకగా.

భూపాల్ మాట్లాడలేదు. అతనికి తెలుసు, ఇలాంటి సామాన్య యువతి తన స్టేటస్‌కి ఎంతమాత్రం తగదని. ఆ మాటే తండ్రి అంటాడని—

"ఈ రోజు కనుక్కుంటాలే" అన్నాడు ముక్తసరిగా.

ఆ రోజు ఫరువాల విందుకు అతను రాలేదు. బహుశ తండ్రితో మాట్లాడుతూ వుండి వుంటాడు, అందుకే రాలేదని సరి పెట్టుకుంది భానుప్రభ. ఎప్పుడు తెల్లవారుతుందా! ఎప్పుడతను వచ్చి తన వీనులవిందుగా, అమృత మధురంగా తనకి ఆ మంగళకరవార్త వినిపిస్తాడా! అన్న తహతహలో ఆమెకి ఆ రాత్రి నిద్రపట్టలేదు. అబ్బ! ఎంతకీ తెల్లవారదే? అని విసుక్కుంది. చివరకామె మొర ఆలకించినట్లు సూర్యోదయం అయింది. చకచకా అన్ని పనులూ ముగించుకుని చక్కగా టాయ్‌లెట్ అయి ఆఫీసుకు వచ్చింది. భూపాల్ రాలేదు. కాని అతని సీట్లో వృద్ధజంబుకం వరప్రసాద్ దర్శనమిచ్చాడు. వుసూరుమంటూ తన పని చూసుకోసాగింది. ఆ రోజు ఆ మర్నాడే కాదు-ఆ వారంలోనే అతని దర్శనం కాలేదు. అది చూసి నిరాశ, భయం, ఆవేదన అన్నీ మిళితం కాగా కళ్ళంబడి గిర్రున నీళ్ళు తిరిగాయి భానుప్రభకి. ఆ కన్నీరు ఇంతై, అంతై చివరికి మహానదిలా తీవ్ర రూపం దాల్చింది.

'చివరికి ఇతనూ మోసగాడేనా! ఇంత విద్యావతి ఇంత తెలివి గలది అనిపించుకున్న తను కూడా మొగవాడి మాయకు మోస పోయిందా? తను హృదయపూర్వకంగా ప్రేమించిన భూపాల్ ఇంత కపటవర్తనుడా!' అనుకుంటూ కుళ్ళి కుళ్ళి ఏడ్చింది.

నెల గడిచినా భూపాల్ కనిపించకపోయేసరికి దిగులుతో చిక్కి శల్యమైంది భానుప్రభ. అన్నింటికంటే మరీ వ్యధాభరిత మైంది తన ఇంటికి తను భూపాల్‌ని పెళ్ళి చేసుకోబోతున్నట్టు

వుత్తరం రాయడం.

చివరికి ధైర్యంచేసి "భూపాల్‌గారు యిప్పట్లో రారా?" అని అడిగింది వరప్రసాద్‌ని.

"ఎందుకు?" అని అడిగాడు ముఖం చిట్లించి.

ఆ రూపం చూసేసరికి దడ పుట్టింది భానుప్రభకి.

"ఏమీ లేదు. నాకీ నెల్లో ఇంక్రిమెంట్ ఇస్తానన్నారు అందుకని."

"వాడా! వాడలాగే చెబుతుంటాడులే. నిన్నగాక మొన్న జీతాలు పెంచి పి. ఎ. గా వేసుకుంటే అప్పుడే ఏం ఇంక్రిమెంట్లు? అడగడానికి నీకు, ఇస్తానంటూ వాగ్దానం చెయ్యడానికి వాడికి బుద్ధి లేకపోతే సరి" అంటూ దులిపేస్తుంటే ఛళ్ళున కొరడాతో కొట్టినట్లయింది భానుప్రభకి.

ఆఖరున "వాడి మాట లెప్పుడూ నమ్మకు" అంటూ ఓ సలహా కూడా పారేశాడు వృద్ధజంబుకం.

ఆ మాట చెంప పెట్టులా తగిలింది భానుప్రభకి.

వెధవది ఓ పాతికో-పరకో ఇంక్రిమెంటుకే ఇన్ని చదివిన ఈయనగారు తనని కోడలిగా అంగీకరించడానికి వచ్చినా ఒప్పుకోడని అర్థమయిపోయింది భానుప్రభకి. అందుకే భూపాల్ తనకి ముఖం చాటేశాడని కూడా నిర్ధారణయిపోయింది.

ఛీ! ఆకాశానికి నిచ్చెన వేయబోయి పాతాళానికి కూరుకుపోయినట్లయింది తన పని. అంత ఐశ్వర్యవంతుడిని ప్రేమించడం-ఆ ఇంటికి కోడలు కావాలని కలలు కనడం తనదెంత తెలివితక్కువో తనకే స్పష్టమయిపోయింది. పైగా నీటిమీద రాతలులాంటి అతని మాటలు నమ్మి తను తన తండ్రికి, తల్లికి అందరికీ పెద్ద గొప్పగా తన పెళ్ళిని గురించి చెప్పడం, వాళ్ళ దగ్గర తన మాటలు వమ్మయి ఎంత తలవంపులు తెచ్చి పెట్టుకుందో తలచుకుంటే తనమీద తనకే అసహ్యం కలగసాగింది.

మోసపోయానన్న రోషం-భూపాల్ కనబడలేదన్న బాధ, తల్లిదండ్రుల దగ్గర తన పరువు పోయిందన్న దిగులు అన్నీ ఆమెని

నిలువునా కుంగదీశాయి. అన్నింటికంటే మరో పదిహేను రోజుల తరువాత బయట పడిన భయంకర సత్యం-ఆమె గర్భవతి కావడం. దాంతో పూర్తిగా మతి చలించినదానిలా అయిపోయింది. ఇంత తెలివి, ఇంత విద్య, ఇంత వివేకమూ క్షణికావేశాలకు బలయ్యాయే అన్న బాధతో ఎవరికీ ముఖం చూపించలేకపోయింది. మూడో నెల వచ్చేసరికే తనని లోకం హేళనగా చూస్తోందన్న భయంతో గజగజా వణికిపోయింది. ఆఖరు ఆశగా మద్రాసు అడ్రసు సంపాదించి భూపాల్‌కి వుత్తరం రాసింది.

"భూపాల్ గారికి,

నేను మీకు గుర్తుండి వుంటానన్న నమ్మకం నాకు ఏకోశానా లేదు కనుక నేను మీకు పరిచయం చేసుకోక తప్పదు. నేను భానుప్రభని. నా అందానికి, నా తెలివితేటలకి మీరు మెచ్చి పి. ఏ. అంటూ అందలం ఎక్కించిన భానుప్రభను. మీకు లీలామాత్రంగా నయినా గుర్తుంటే ధన్యురాలినే.

నాకలాంటి పనులంటే, పెళ్ళి కాకుండా సెక్సు సంబంధాలంటే ఇష్టం లేదని ఎంత మొత్తుకున్నా పెళ్ళి చేసుకుంటానంటూ వగ్దానాలు చేసి నన్ను లోబరుచుకున్నారు. నన్నో బొమ్మకింద మలచి మీ యిష్టం వచ్చినట్టు అనుభవించారు. మీ నాన్నగారు వచ్చాక పెళ్ళిమాట కనుక్కోమంటే హైద్రాబాద్‌నించే వెళ్ళిపోయారు. బహుశా అదే మీ జవాబని ఆనాడే నిర్ణయించుకుని వూరుకున్నా, పరిస్థితులు మీకు వెతుకుంటూ అయినా ఉత్తరం రాయాల్సిన అవసరం కల్పించాయి. నేను గర్భవతిని. మీ బిడ్డ నా గర్భంలో రూపు దిద్దుకుంటున్నాడు. దయచేసి నన్ను పరిగ్రహించి నలుగురితో నాకు గౌరవం కలిగించండి. మీ బిడ్డకు తండ్రిగా బాధ్యత స్వీకరించండి. ఈ ఉత్తరం అందిన వారంలోగా మీనించి జవాబు లేదా, మీరే వచ్చినా నాకు కొండంత అండ.

ఇట్లు మీ అభాగ్య భాను."

ఆ ఉత్తరం రిజిష్టరు పోస్టులో పంపింది భూపాల్‌కి. అతనే అందుకున్నాడు కూడా. చదువుకుని ఒక్క క్షణం ఆలోచించి ఆ

ఉత్తరం చింపి ముక్కలుచేసి వేస్టుపేపర్ బాస్కెట్‌లో పడవేశా

'ఈ విధంగా గర్భస్థ శిశువులందరికీ తనే తండ్రినం అంగీకరించుకుంటూ పోతే హైదరాబాద్ నవాబుగారిలా మూడువం మంది పెళ్ళాలూ-మూడు వందలమంది కొడుకులు తయారై కూరు టారు. శతకోటి లింగాల్లో బోడిలింగమని, తను అనుభవించి వది వారిలో ఈమె ఎన్నోదో తనకే గుర్తు లేదు' అనుకున్నాడు ష్యంగా. కాని ఏదో మూల భానుప్రభ అందరిలాంటి అమ్మా కాదని, ఆమె ప్రేమలో కపటం ఏమీ లేదని తటిల్లతలా మెరిసి మళ్ళీ అలాగే మాయమైంది.

భానుప్రభ ఆఖరి ఆశ కూడా అడుగంటిపోయింది. వుత్తరం అతను అందుకున్నాడని అర్థం అవుతూనే వుంది సం వల్ల. అంటే ఆ వుత్తరం చదివే వుంటాడు. తను గర్భవతి తెలుసుకునే వుంటాడు. అయినా అతను చెక్కుచెదరలేదంటే నెంత కఠినచిత్తుడో అర్థం అవుతూనే వుంది. ఇంక అలాంటివా కాళ్ళా వేళ్ళా పడి తనెందుకు ప్రాధేయపడాలి? అలా అని ఈ రట్టుచేసుకుంటూ తనవారి దగ్గర నిందలు, నిష్ఠూరాలు-లోకంచేత మానాలూ, తిరస్కారాలూ పడవలసిన పనిలేదు. తన చేతిలో వుంది. బుర్రలో తెలివితేట లున్నాయి. ఓ దుష్యంతుడు మరచి మాత్రాన శకుంతల భరతుడిని కనకుండా వుందా? పెంచకు వుందా? సాధ్వీమణి కాకపోయిందా? తన బ్రతుకూ అంతే. పుణ్యకాలం. ఏ కాలంలో అయినా రహస్యంగా పెళ్ళిళ్ళు చేసు తనలాంటి ఆడబడుచులందరూ శకుంతలలులాగే మిగిలిపోతున్నా

ఈ విధంగా అమృత మధనం జరిగిన తరువాత తన చెల్లెలు సు మిత్రకి ఓ ఉత్తరం రాసి అది తన ఇంట్లో టేబుల్‌మీద పే వెయిట్ క్రింద పెట్టి తన బట్టలన్నీ సూట్‌కేసులో సర్దుకుని చెవి పక్కవాళ్ళింట్లో యిచ్చి "నేను మా యింటికి వెడుతున్నా ఆఫీసు పనిమీద నా స్నేహితురాలు వస్తుంది. ఆమె వచ్చి అ తాళం ఇవ్వండి. నేను నెల రోజుల శెలవు మీద వెడుతున్నా అంటే, నిజమేనని నమ్మారు ఆ పొరుగింటివారు. ఆఫీసుకు రి

ంది. తన పేరున వున్న డబ్బంతా డ్రా చేసుకుంది. ఆ తర్వాత
ే వెళ్ళిపోయింది.

అక్క దగ్గర్నించి పదిహేను రోజులయినా ఉత్తరం లేదు. ంధామయ్యకి వున్నట్టుండి జ్వరం వచ్చి అది టైఫాయిడ్‌గా రణ అయింది. ఆ విషయం తెలియజేస్తూ ఉత్తరం రాసినా ి వచ్చేయడంతో హడలిపోయిన తల్లిదండ్రులు సూర్యమిత్రని పిరమ్మని పంపారు. ఆమె వచ్చేసరికి ఇంటికి తాళం కనిపించింది. చూసి అదిరిపడింది.

"ఏమండీ! ఈవిడ లేదా?" అని అడిగింది భయం ంగానే.

"ఆమె వాళ్ళ వాళ్ళింటికి నెల సెలవుపెట్టి వెడుతున్నానని, హితురాలెవరో వస్తుంది, వస్తే తాళం ఇవ్వమని చెప్పి వెళ్ళిం ీ" అంటూ తాళం అందించారు.

"ఎన్నాళ్ళయింది వెళ్ళి?" అని అడిగింది ఒకవేళ తనిటు లుదేరినట్టే ఆమె అటు బయుదేరిందేమోనని.

"వెళ్ళి ఇరవయి రోజులపైనే అయిందండీ." అంటే నిలు కూలినట్లయింది సూర్యమిత్రకి. తాళంతీసి లోపల ప్రవేశించ ఆమెకి ఎదురుగా కనిపించింది ఆ వుత్తరమే. అది అందుకుని కుతూనే చదివింది!

"సూర్యా! నేనీ వూరు ఉద్యోగానికి వచ్చిన రోజున ఎంతో ోషించాను. మా కంపెనీ డైరెక్టరుగారు నన్ను వలచి పెళ్ళాడు ంటే నా అంత అదృష్టవంతురాలు లేదని మురిసిపోయాను. ఆ పాలు, ఆ సంతోషాలు వెండి మబ్బుల్లాంటివని గ్రహించలేక యాను. చివరకి వెండి కరిగిపోయింది. మబ్బు మిగిలింది. ఆ ్వ చివరికి కారుమబ్బుల్లా కమ్ముకున్నాయి నా జీవితాన్ని. అంత ీ నీకు నేను ఏమీ చెప్పలేను. మా భూపాల్‌గారు నన్ను ్యయం చేశారు. నన్ను భార్యగా స్వీకరించడానికిగాని, నాకు బోయే బిడ్డకి తండ్రిగా నిలబడడానికిగాని ఇష్టం లేకపోయింది. విషయం అమ్మా, నాన్నలకి తెలిస్తే ఎంత తుఫాను రేగుతుందో

నాకు తెలుసు. అందుకే నీకు మాత్రమే తెలియజేస్తున్నాను. నీలో దాచుకో! ఇవన్నీ పైకి పొక్కనీయకు. నేను మీ అంద దూరంగా వెళ్ళిపోతున్నాను. మరేవిధంగానయినా నా నిష్క్రమ తెలియజేయి. అంతేగాని కూతురి దౌర్భాగ్య స్థితిని మటుకు డించకు. ఇది నేను నిన్ను అర్థిస్తున్నాను. ప్రార్థిస్తున్నాను. అక్క కోరిక ఒక్కటీ మన్నించు.

నీ అక్క భాను

ఆ ఉత్తరం చదివి ఎంతోసేపు ఏడ్చింది సూర్యమిత్ర. రాత్రికి అక్కడే పడుకుని తెల్లవారి భూపాల్‌ని వెతుక్కుంటూ ఆఫీసుకే వెళ్ళింది సూర్యమిత్ర.

తండ్రీ కొడుకు లిద్దరూ వున్నారానాడు.

"ఏం కావాలి?" అంటూ ప్రశ్నించాడు వరప్రసాద్.

"మీ ఆఫీసులో ఉద్యోగం కావాలి. ఇస్తారా?" అని అడిగి ఖంగుమంటూ.

ఆ కంఠానికి ఒక్క క్షణం తండ్రీ కొడుకులే బి పోయారు.

"క్వాలిఫికేషన్స్ ఏమిటి?" అని అడిగాడు భూపాల్.

"బి. కాం. స్టూడెంట్‌ని నేను" అంటూ చెప్పింది.

"అంటే పట్టా పుచ్చుకున్నావా?"

"ఇంకా పరీక్షలే కాందే పట్టా ఎలా వస్తుంది?"

"మరి టైప్‌రైటింగ్ వచ్చా?"

"ఆ. అది షార్టుహ్యాండ్ ప్యాసయ్యాను."

"చదువెందుకు ఆపుతావు?"

"ఆర్థికస్థితి బాగాలేదు కనుక. ఇక్కడ వుద్యోగం ఇస్తే మూడు నెలలూ ప్రయివేటుగా చదివి పరీక్ష రాసి వస్తాను."

భూపాల్ పదినిముషా లలాగే రెప్ప వాల్చకుండా చూశ సూర్యమిత్రకేసి. నిర్భయంగా ఆ చూపులో చూపు కలిపింది సూ మిత్ర. అది కూడా స్పష్టంగా గ్రహించిన భూపాల్ "ఈమె పే తగినట్టే చాకులాంటి పిల్ల" అనుకున్నాడు.

"రేపు ఉదయం ఇదే సమయానికి వస్తే ఏ సంగతీ చెబు
ను" అన్నాడు భూపాల్.

"అలాగే తప్పకుండా వస్తాను" అంటూ నమస్కరించి
వు తీసుకుంది సూర్యమిత్ర.

"ఏమిరా ఈ పిల్లకి వుద్యోగం ఇద్దామంటావా?" అడిగాడు
ప్రసాద్.

"ఇద్దాం. భానుప్రభ వెళ్ళిపోయాక సరైన ఆడపిల్ల దొరికితే
ంకుందాం అనే అనుకుంటున్నాముగా."

"అవునులే."

"అందుకే మరి! ఇంకా డిగ్రీ పుచ్చుకోలేదన్న సాకుతో
్కువ జీతమే ఇవ్వచ్చుగదా!"

సుపుత్రుడి తెలివికి పరమానందాభరితుడయ్యాడు వరప్రసాద్.
మర్నాడు సరిగ్గా అదే సమయానికి వచ్చిన సూర్యమిత్రకి "నీకు
్యగం ఇవ్వాలనే అనిపించి ఇస్తున్నాను. జీతం మటుకు ఇంతి
ను. ఇష్టమైతే చెయ్యి, కష్టం అనుకుంటే మానవచ్చు" అంటూ
వ్వబోయే జీతం అంకె చెప్పాడు.

ఏదోవిధంగా ఆ కోటలో పాగా వెయ్యాలనే వచ్చిన సూర్య
త వెంటనే అంగీకరించింది.

తను వుద్యోగంలో చేరిన నాలుగు రోజులకి తల్లి దండ్రులకి
త్తరం రాసింది వెంటనే బయలుదేరి రమ్మని.

అప్పుడే జ్వరం నార్మలుకి వచ్చిన పరంధామయ్య లేని ఓపిక
్చుకుని భార్య సాయంతో వచ్చాడు హైద్రాబాద్. భార్యాభర్తలు
ంచి ఆనందపడుతూ వచ్చింది వేరు. కూతురి పెళ్ళి నిశ్చయమైం
ా అన్న సంబరంతో వచ్చిన వాళ్ళు కూతురు విజయవాడ
ంలుదేరి మధ్యలో గల్లంతయిందన్న వార్త చిన్న కుమార్తె నోటి
ట విని గొల్లుమన్నారు. అసలే అంతంతమాత్రం ఆరోగ్యంతో
్న పరంధామయ్యకి పెద్ద షాక్ కింద మారి మరి మంచంమీద
చి లేవక్కర్లేని పరిస్థితిలో పడిపోయాడు. చివరకా ఉద్యోగం
ర్యమిత్ర జీతమే గతి అయ్యాయి.

జ్యోతి

ఇవన్నీ చూస్తుంటే సూర్యమిత్ర గుండెలు మండిపోయాయి. 'ఇన్ని అనర్థాలూ ఎందువల్ల జరిగాయి? అదుగో ఆ ధూర్త భూపాల్ వల్ల. అతన్ని నిలువునా షూట్‌చేసి పారేయాలి' అనుకుంటూ కాల నాగినిలా బుసలు కొట్టింది. కాని పేదవారి కోపం పెదవికి చేటు. అందుకే తమాయించుకుంది.

# 8

భానుప్రభ చెల్లెలేనన్న విషయం తెలియని భూపాల్ సూర్య మిత్ర అంటే కాస్త కాస్తే ఆకర్షణ పెంచుకోసాగాడు. ఆడపిల్ల అంటే అతనికి ఆదినించీ చులకన భావమే తప్ప పెద్ద గౌరవం లేని అతనికి ఈ సూర్యమిత్ర కూడా తనకి దాసోహం అంటే చాలుననే స్థితికి వచ్చాడు. కాని సూర్యమిత్ర ముందునించీ అతను తన అక్క భర్తగానే చూస్తూ ఎలాగయినా అవకాశం చిక్కితే అతన్ని నాలుగూ అడిగేయాలనే అనుకుంటూ పైకి మాత్రం అతి ముభావంగానే వుండ సాగింది.

"ఇంతకీ ఈ హైదరాబాద్‌లో మీరు ఏమేం సినిమాలు చూశారు?" అని అడిగాడు ఒకసారి ఫైల్ తిరగేస్తూ.

"సినిమాలా? ఎందుకా సినిమాలు డబ్బు దండుగకి తప్ప" అంది నిక్కచ్చిగా.

"అదేమిటలా అంటున్నారు? ఏదో కాలక్షేపానికి-సరదాకి" అన్నాడు నవ్వుతూ.

"అవన్నీ మీబోటివారికి. నాలాంటి జీతగత్తెకి కాదు."

"వినోదం కోసం ఎవరయినా ఒకటే. మీరూ సంపాదించుకుంటున్నారు. పేదవారు. మరీ సినిమాలు కూడా చూడలేనంత పేదవారా?"

"కాకపోవచ్చు. కాని నాకే యిష్టం లేదు. ఈ సినిమాలన్నీ ఒకటే. మగవాడి విలాసాలనే ఏకరూ పెడుతుంటాయి. దాని మూలాన ఆడపిల్ల కనిపిస్తే మగాడి బుద్ధి మరో రకంగా మారి పోతోంది. ఈనాటి ఈ విచ్చలవిడితనానికి సినిమాలు కూడా కొంత కారణం. చివరకా జల్సారాయుళ్ళు ఏవిధంగా చిక్కులు పడుతుం

టారో చూపించినా అది మాత్రం వదిలేస్తారు. ఆ నీతీ కొట్టిపారేస్తుంటారు" అంది ఏకబిగిని.

"బాబోయ్ చూడకుండానే ఇన్ని చెప్పారు. ఇంక చూస్తే నాబోటివా డసలు నోరెత్తలేదు" అంటూ ఫైలు మూసేసి ఆమెకి, అందించాడు.

"ఈ ఏడు కంపెనీకి కాస్త లాస్ వచ్చేలా కనిపిస్తోంది". అన్నది సూర్యమిత్ర.

"అవును. అదెలా పూడ్చాలా అని చూస్తున్నాను" అన్నాడు వెనక్కి వాలి.

"అందుకు ఏ సినిమా అయినా తోడ్పడుతుందేమో వెళ్ళి చూసి రండి" అంది నవ్వుతూ.

"అలాగే! మీరు కూడా నాతో వస్తానంటే."

"ఎక్స్‌క్యూజ్‌మి. అలా నన్నెప్పుడూ ఆహ్వానించకండి" అంటూ తన సీటులోకి వెళ్ళిపోయింది.

'భానుప్రభకంటే పదాకులు ఎక్కువ చదివినట్లుంది. ఎలా ఈమెని తన దారికి మరలించుకోవడం?' అన్న ఆలోచనలో పడిపోయాడు భూపాల్.

మరో వారం గడిచాక—

"కొంచెం మా యింటికి వస్తావా, లెక్కలు చూద్దాం. నిజంగానే, లాస్ వచ్చింది" అన్నాడు భూపాల్.

"అలాగే!" అంటూ అతనితోపాటు కారులో అతని ఇంటికి వచ్చింది. ముందు యిల్లంతా చూపించి తన ఐశ్వర్యం ప్రదర్శించాడు భూపాల్. అయినా అతనాశించిన మార్పేం కనిపించలేదు మిత్రలో. టిఫిన్, కాఫీలు అయ్యాక ఎకౌంట్స్ పుస్తకాలు ముందు పెట్టుకు కూర్చున్నా రిద్దరూ. ఆ పూట ఎనిమిది గంటలవరకూ అక్కడే వుంది సూర్యమిత్ర.

"భోజనం చేసి వెళ్ళు" అన్నాడు భూపాల్.

"వద్దు. మా అమ్మగారు నా కోసం ఎదురు చూస్తుంటారు. ఇలా భోజనాలు అక్కడా అక్కడా చేసి వచ్చానంటే ఒప్పుకోరు"

అంటూ లేచింది.

"మరి చీకటి పడింది. ఎలా వెడతావు?"

"మరేం ఫర్వాలేదు. నేను వెళ్ళగలను" అంటూ ఓ నమస్కారం చేసి వెళ్ళిపోతుంటే పెదవి కొరుక్కున్నాడు భూపాల్.

మరో రోజు ఇదే విధంగా ఇంటికి రమ్మంటే "నేను ఆఫీసులో పని పూర్తిచేసి జాగ్రత్తగా లాక్‌చేసి వెడతాను" అంటూ అందరి ఎదుటా మొండిగా చెప్పింది. దాంతో మండింది. 'ఇంత కొరకరాని కొయ్య ఏమిటి?' అనుకున్నాడు కసిగా.

'ఇంకిలా అయితే తనకేం లాభం? ఉద్యోగం వూడపీకితే సరి. మరో అందాల భామని అనుకూలంగా వుండేదాన్ని వేసుకోవచ్చు' అనుకున్నాడు.

"నేను పరీక్ష రాయడానికి విజయవాడ వెడుతున్నాను" అంటూ సెలవు చీటీ యిచ్చింది సూర్యమిత్ర. ఆ క్షణంలో బుర్ర చురుగ్గా పని చేసింది భూపాల్‌కి.

"అయితే నేనూ పనిమీద బెజవాడ వెడుతున్నాను. రా! దింపుతాను."

పగటిపూట ప్రయాణమే కనుక ధైర్యంగా అంగీకరించింది. హుషారుగా కబుర్లు చెబుతూ నిదానంగానే పోనిచ్చాడు కారుని. కారు విజయవాడలో అతని తోట ముందు ఆగింది.

"ఇదేమి టిక్కడ ఆపారు?" అని అడిగింది ఆశ్చర్యంగా.

భీమసింగ్ తటాలున యివతలికి వచ్చి "రండమ్మా" అంటూ సూట్‌కేస్ అందుకుని లోపలకి ఆహ్వానించాడు.

"ఇది మా తోట. ఇక్కడ ఓ చిన్నపని మాలికి చెప్పి వెళ్ళిపోదాం" అంటూ భీమ్‌సింగ్ తలుపులు తీస్తుంటే లోపలకి ప్రవేశించాడు.

సూర్యమిత్ర అనుమానంగానే అతనివెంట లోపలకి వచ్చింది. అలా కూర్చోగానే ఇలా కాఫీఅందించాడు భీమసింగ్.

అది తాగాక "ఇంక నేను వెడతాను. మీ పనులేమన్నా వుంటే చూసుకోండి" అంటూ లేచింది సూర్యమిత్ర.

కాని భూపాల్ వెళ్ళనీయలేదు. తలుపుకు అడ్డంగా నిలబడి "ఎందుకలా భయపడతావు? నేను నిన్నేమన్నా చేస్తానా?" అన్నాడు కవ్వింపుగా.

"ఏమన్నా చేయడానికి నేను భానుప్రభని కాను" రోషంగా జవాబిచ్చింది సూర్యమిత్ర.

ఆ మాటకి కాస్త చకితుడై చూశాడు భూపాల్ "దాని సంగతి నీకెలా తెలుసు?" అని అడిగాడు నవ్వుతూ.

"శ్రీకృష్ణ లీలలు ఎవరో ఒకరు వర్ణించకపోతారా?" వ్యంగ్యంగా అంది సూర్యమిత్ర.

"అయితే ఇంకేం! నా సంగతి నీకు తెలుసన్నమాట."

"ఆ!"

"వాళ్ళందర్నీ వదిలేయి. నాకు నువ్వు బాగా నచ్చావు. నీ ధైర్యం, నీ చలాకీతనం అన్నీ మైమరపించాయి. నువ్వు వూ అను నిన్ను నా యింటికి రాణిని చేస్తాను" అన్నాడు తలుపు గడియవేసి.

అప్పుడు కాస్త భయపడింది సూర్యమిత్ర.

"ఇలా ఎందరి దగ్గర కబుర్లు చెబుతారు?" అని అడిగింది తీవ్రంగా.

"ఎందుకా? పనికిరాని దద్దమ్మలు పాతికమంది. నీలాంటి రతీదేవి ఒక్కత్తి చాలు" అంటూ ఆమెని గట్టిగా బంధించాడు.

ఆ కౌగిలిలోంచి విడిపించుకోవాలని ఆమె గింజుకుంటున్న కొద్దీ అతనికి మరింత పౌరుషం పెరిగి కౌగిలి మరింత బిగించసాగాడు. ఆ ఉక్కు చేతుల్లో వూపిరాడక గిలగిల్లాడింది సూర్యమిత్ర. ఏమయినా వదలదలుచుకోలేదు భూపాల్. అతనిలో అప్పటికే రాక్షసుడు చోటు చేసుకున్నాడు.

"ఛీ. వదులు. నీమీద కేసుపెట్టించి జైలులో వేయించకపోతే నా పేరు సూర్యమిత్ర కాదు" అంది బుసలుకొడుతూ.

"ఏడిశావు" అంటూ తిరస్కారంగా అన్నాడు భూపాల్.

ఆ మాటకి ఆగ్రహం మిన్నుముట్టిన సూర్యమిత్ర అక్కడ ఫ్లవర్‌వాజ్ వుంటే ఎత్తి కొట్టబోయింది.

దాంతో కోపం మిన్నుముట్టిన భూపాల్ లేచి "భీమ్" అని పిలిచాడు గట్టిగా.

వచ్చాడు భీమసింగ్. "దీన్ని తీసుకువెళ్ళి సీక్రెట్ రూంలో పడేయి" అన్నాడు కర్కశంగా.

అనడం తడవు చెయ్యి పుచ్చుకుని బరబరా ఈడ్చుకుపోయి తలుపు తీసి లోపలకి నెట్టి బయట తాళం పెట్టాడు భీమసింగ్.

ఆ రాత్రి ఆకలికి, దాహానికి అలమటించింది సూర్యమిత్ర.

తెల్లవారి భీమసింగ్ తలుపు తీసేసరికి నిస్సత్తువగా నేలమీద పడివుంది సూర్యమిత్ర.

కాస్త కాఫీ అక్కడుంచి తలుపు వేశాడు అయ్యగారి ఆజ్ఞ ప్రకారం.

ఎలాగైనా బయట పడాలనుకుంటూ ఆ కాఫీ త్రాగింది సూర్యమిత్ర.

మధ్యాహ్నం భోజనం అలాగే వచ్చింది. విధిలేనట్టే తిన్నది.

'ఇంకా ఎన్నాళ్ళీ నిర్బంధం? భూపాల్ ఏమయ్యాడు. రేపే తన పరీక్ష. అదేమవుతుంది?' అనుకుంటూ చాలాసేపు ఏడ్చింది.

ఆ రాత్రిం భోజనం, మంచినీళ్లు అలాగే వచ్చాయి. అవి తిని ఆ మంచినీళ్లు త్రాగి వెంటనే ఆ నేలమీద నిద్రపోయింది.

సరిగ్గా పదింటికి వచ్చిన భూపాల్ ఆమెనలాగే ఎత్తుకుని తన గదిలోకి తీసుకువెళ్ళి తన మంచంమీద పడుకోబెట్టుకున్నాడు. అలాగే అచేతనంగా పడివుంది సూర్యమిత్ర.

"అందర్నీ మించిపోయావు నువ్వు. నీకోసం చివరకి దండోపాయం ఉపయోగించవలసి వచ్చింది" అనుకున్నాడు వికృతంగా ఆమెమీదకి వరుగుతూ. నోట్లోంచి మందు తాలుకూ వాసన గుప్పుమంటోంది.

మరో గంట తర్వాత భూపాల్ కారు హైదరాబాద్ రూటు మళ్ళింది. తెల్లవారేసరికి మెళుకువ వచ్చిన సూర్యమిత్ర అతని మంచంమీద తను వుండటం, అతను లేకపోవడం గమనించి అదిరి పడుతూనే క్రిందకి దిగి వచ్చింది. అక్కడ ఎవరూ కనిపించలేదు.

వచ్చే కన్నీళ్ళ నాపుకుంటూ నడిచి నడిచి ఇల్లు చేరింది. తన శీలాన్ని అతను హరించే వెళ్ళాడని గ్రహించి భగ్గున మండిపోయింది.

'మిస్టర్ భూపాల్! నూరు గొడ్లని తిన్న రాబందు ఒక్క గాలి వానకి సఫామన్నట్టే ఇష్టంలేని ఆడదాన్ని చెరిచే నిన్ను సర్వనాశనం చేసి నా పగ సాధిస్తాను' అనుకుంటూ ఆవేశంతో వూగిపోయింది.

చక్కగా స్నానంచేసి పరీక్షకు వెళ్ళింది. పట్టుదలగా పరీక్షలు రాసినా మనస్సు మండుతూనే వుంది. తనలాగే ప్రతీకార జ్వాలలతో రగిలిపోతూ తన అక్కకూడా ఎక్కడో జీవించే వుంటుందని గట్టిగా నమ్మింది సూర్యమిత్ర.

పరీక్షలు రాసి వచ్చింది హైదరాబాద్. ఆ ఉద్యోగం చెయ్యాలనిపించలేదు. మానేసింది. ఉద్యోగంకోసం వేటాడుతూండగానే తండ్రి కాలధర్మం చెందాడు. విజయవాడలో ఉద్యోగం రాగానే తల్లిని తీసుకుని హైదరాబాద్‌కి శాశ్వతంగా గుడ్‌బై కొట్టింది.

నిజానికి తల్లిని పల్లెటూరులో వుంచింది సూర్యమిత్రే! అక్కడ ఆమె పుట్టింటి వారుంటే వారి దగ్గర తల్లిని అట్టిపెట్టి తను మాత్రం విజయవాడలో వుంటూ నెలనెలా డబ్బు పంపిస్తుంది. ఎవరడిగినా అక్కని తనని ఎరుగున్నవారు పల్లెటూరులో అక్కదగ్గర అమ్మ వుంటోందానే చెబుతుంది మిత్ర. అక్క చనిపోయిందని చెప్పడం ఇష్టంలేదు. రేపొకవేళ జీవించి కనిపిస్తే పోయిందన్నావుగా! ఎలా బతికింది? అని అడుగుతారేమోనన్న జంకుతో ఇష్టం వచ్చినన్ని కథల్లి చెబుతూ వుంటుంది.

కాగితం తీసిన దగ్గర్నించి, చివరివరకూ ఏదో సస్పెన్స్ పిక్చర్ చూస్తున్నంత థ్రిల్లింగ్‌గా చదువుతున్న ఉత్తమచంద్ర ఆద్యంతం చదివి ఇంత అమానుషంగా ప్రవర్తించాడు కనకే అతన్ని నామరూపాలులేకుండా చేయాలని - ఏ యింట తనని అతడు బలాత్కరించాడో ఆ యింటే అతన్ని చంపేయాలని ఆమె కోరిక లోని ఆంతర్యం అర్థమయి మెల్లగా లేచాడు. ఆ కాగితాలు తీసి జాగ్రత్తగా దాచిపెట్టాడు.

'వజ్రాన్ని వజ్రంతోనే కొయ్యాలని, అతన్ని చంపేస్తే ఏం

లాభం? అతనిలో పరివర్తన తీసుకురావాలిగాని' అనుకున్నాడు ఉత్తమచంద్ర.

ఒకవేళ ఆమె అక్క తిరిగి యెక్కడన్నా దర్శనమిస్తే, భూపాల్ లేకపోతే దిగులుపడుతుందేమో. అయినా రెండేళ్ళో మూడేళ్ళో అయి వెళ్ళిపోయిన భానుప్రభ యెక్కడున్నా ఓ వుత్తరం ముక్క రాయకుండా వుంటుందా? అంత ధైర్యంగా ఇల్లువదిలి వెళ్ళిన ఆమె ధైర్యం కడంటా నిలుపుకుంటుందా? మధ్యలో భీరువై ప్రాణం తీసుకుందా. రకరకాల ఆలోచనలూ అతన్ని పీడించసాగాయి. అంతేనా తెల్లవార్లూ నిద్రకూడా లేకుండా చేశాయి.

'తన జీవితంలో ఒక్కసారిగా ఇన్ని మార్పులు వస్తాయని యెక్కడన్నా కలగన్నాడా? అసలు తనెందుకు జైల్లో పడాలి? అది భరించలేక ఎందుకు పారిపోయి రావాలి? చివరికి వచ్చినవాడికి ఈ సూర్యమిత్రే యెందుకు తారసపడాలి? తన బతుకే అనుకుంటే అంతకంటే భయంకరమైన చరిత్రల నెందుకు వినాలి. అంతా ఏదో సామెత చెప్పినట్టు అంతా వాడి లీల' అనుకున్నాడు భారంగా నిట్టూర్చి.

తెల్లవారి ఆఫీసుకు వచ్చాక "చదివారా?" అని అడిగింది సూర్యమిత్ర.

చదివా నన్నట్టు తల వూపాడు.

"ఇప్పుడర్థమైందా నాలో అంత ప్రతీకార జిగీష ఎందుకు రగులుతోందా?" అని అడిగింది కళ్లు తుడుచుకుంటూ.

"అర్థమయింది. కాని ఎందుకో మనసులో అతన్ని చంపేయడమే సరైనమార్గం అని అనిపించడంలేదు. ఆ వాదన బలహీనంగా కనిపిస్తోంది" అన్నాడు.

"కనిపిస్తుంది. ఎందుకు కనిపించదు? మీరూ మగవారేగా? అతడినే సమర్థిస్తారు" అంది విసురుగా.

"నేను సమర్థించడం లేదు. అసలతగాడిని ఏ నరాధముడూ ఈ భూప్రపంచంలో సమర్థిస్తాడని నేను అనుకోను. కాని మీ అక్కయ్యకి కొడుకో కూతురో పుట్టివుంటే వాళ్ళని దృష్టిలో పెట్టుకుంటే

భూపాల్ దోషి అయినా దండించే విధానం అది కాదనిపిస్తోంది" అంటూ ఆగి పరీక్షగా ఆమె ముఖంకేసి చూశాడు.

"ఆ! అక్కయ్యకే దిక్కులేదు-ఇంక దాని పిల్లాడి సంగతి ఎవడికి కావాలి! వెనకంటే అక్కని, అతన్ని కలపాలనే అనుకునే దాన్ని. నన్ను పరాభవించాక అతన్ని క్షమించాలని నేను అనుకోవడం లేదు. అతని చావుతో తప్ప నా ఆత్మ శాంతించదు" అంది నిర్మోహమాటంగా సూర్యమిత్ర.

దుశ్శాసనుడు చచ్చేదాకా తల ముడివేసుకోనంటూ విరబోసుకున్న ద్రౌపదికి, సూర్యమిత్రకి తేడా లేదనుకున్నాడు ఉత్తమచంద్ర.

"అయినా సాయంత్రం ఇంటిదగ్గర కలుద్దాం. ఇక్కడ ఈ ఆఫీసులో వాదన దేనికి?" అన్నాడు నచ్చచెబుతూన్నట్లు.

అదీ నిజమేనన్నట్లు తల పంకించింది సూర్యమిత్ర.

అచ్చం బెంగాలీ బాబులా తయారైన ఉత్తమచంద్రని అతను చెప్పినట్టుగానే కలకత్తానించి వచ్చాడన్న భావనతో పెద్దగా యెవరూ సంభాషించరు ఆఫీసులో. పైగా అతి ముభావంగా వుంటూ యెవర్ని చూసి చిరునవ్వుకూడా చిందించని అతనంటే మనసులో ఏం అనుకున్నా దూరంగానే వుంటున్నారు.

# 9

"ముందు భూపాల్‌మీద పగ సాధించేలోగా అసలు భానుప్రభ బ్రతికి వుందో లేదో తేల్చుకోవడం చాలా మంచిదని నా ఉద్దేశం" అని ఉత్తమచంద్ర అన్నాక అందుకు అంగీకరించింది సూర్యమిత్ర.

చివరకి ఆలోచించి ఆలోచించి ఓ మతలబు తయారుచేశాడు.

"డియర్ భానూ! నా తప్పు గ్రహించాను. నిన్ను ఏలుకుంటాను. తిరిగి రావలసింది. పోనీ రావద్దు. నేనే వస్తాను. ఈ బాక్సు నెంబరుకి లెటరు వ్రాయి. నీ వి.బి. పాల్."

"ఇది మనం బాక్స్ నెంబరుతో ఓ నెలరోజులపాటు డైలీ పేపర్స్ అన్నింటిలోనూ యెడ్వర్టయిజ్ చేద్దాం. ఫలితం వుంటుంది భాను యెక్కడున్నా. నెలదాకా ఏమీ రిప్లయ్ రాకపోతే ఆమె గతిం

చిందనే అనుకుందాం" అన్నాడు చూపిస్తూ.

అందుకు అంగీకరించింది. ఆ రోజే లోకల్ పత్రికలన్నింటికీ ఇచ్చాడు యెడ్వర్టయిజ్‌మెంటు.

తమ ప్రయత్నం ఫలించి అక్కయ్య తిరిగి రావాలని కోటి దేవతలకి మొక్కుకుంది సూర్యమిత్ర.

ఆ ఎడ్వర్టయిజ్‌మెంటుని భూపాల్‌కూడా చదివాడు పేపర్లో. అయినా అది తనపేరుమీదుగా తను అన్యాయంచేసిన భానుప్రభ నుద్దేశించి ఇచ్చిందని మాత్రం గ్రహించలేదు.

పదిహేను రోజులు కాలగర్భంలో కలిసిపోయాయి. ఏ విధమైన సమాధానమూ రాలేదు. ఆఖరుకింక అక్క గతించిందన్న నిర్ధారణకి వచ్చింది సూర్యమిత్ర. ఆ మాటతో ఏకీభవించక తప్పలేదు ఉత్తమచంద్రకి.

మరోరోజు గడిచిపోయాక పత్రికాఫీసునించి ఫోన్‌కాల్ వచ్చింది.

"ఒక్కసారి అర్జెంటుగా బయలుదేరి రమ్మని."

వెంటనే సెలవు పెట్టి బయలుదేరింది సూర్యమిత్ర. ఆమె వెనకే తనూ బయలుదేరాడు ఉత్తమచంద్ర. టైమ్ ఆఫీసులో కూర్చుని వుంది ఓ యువతి. చేతిలో రెండేళ్ళ పిల్లవాడున్నాడు. ఆమెని చూడగానే సంభ్రమాశ్చర్యాలతో తల మునకలయింది సూర్యమిత్ర. ఆమె అంతకన్నా దిగ్గున లేచి నిలబడింది.

"అక్కా!" అంది గుండెలు వేగంగా కొట్టుకుంటూండగా.

"సూర్యా!" అంది భాను గద్గదికంగా.

కలా నిజమాన్నట్టు పిచ్చివాడిలా చూస్తున్నాడు ఉత్తమచంద్ర.

"రా అక్కా! ఇంటికి వెళ్ళి మాట్లాడుకుందాం" అంటూ లేవదీసింది.

"ఈ ప్రకటన వేసింది నువ్వేనా సూర్యా" అని అడిగింది భాను.

'ఆ అడగడంలో ధ్వనించిన నిరాశని స్పష్టంగా గ్రహించిన

వాడు ఉత్తమచంద్ర. తన అంచనా తప్పుకాలేదు. ఈమెకి భూపాల్ అంటే ప్రేమ వున్నది. అది సూర్యమిత్ర గుర్తిస్తే ఏమంటుందో చూడాలి, అనుకుంటూ రిక్షా మాట్లాడి ఇంటికి తీసుకువచ్చాడు.

బాబు పచ్చగా, దబ్బపండులా ముమ్మూర్తులా భూపాల్ నోట్లోంచి వూడిపడినట్టే వున్నాడు. సూర్యమిత్రని చూస్తూనే నోరంతా తెరచి నవ్వాడు. ఆ నవ్వు జగన్మోహనకరం కాగా తటాలున ఎత్తుకుని రెండుబుగ్గలూ ముద్దులతో ముంచెత్తింది సూర్యమిత్ర.

"బాబుకి పాలు పడతావా! అన్నం పెడతావా?" అని అడిగింది సూర్య.

"ఇది పాలసైమే! పాలే తాగుతాడు" అంది భానుప్రభ.

గబగబా పాలబూత్‌కి పరుగెత్తి పాలు తెచ్చాడు ఉత్తమ చంద్ర.

"ఎవరే? నువ్వు పెళ్లాడావేమిటి?" అని అడిగింది భాను.

"ఆ విషయాలన్నీ తర్వాత మాట్లాడుకుందాంలే అక్కయ్యా" అంది కూరలబుట్ట తీసి కూరలు చూసుకుంటూ.

భానుప్రభ మాట్లాడకుండా చెల్లెలినే ఒక్కక్షణం పరిశీలనగా చూసి "అమ్మా! నాన్న ఎక్కడున్నారు?" అని అడిగింది.

"నాన్న! ఇంకెక్కడి నాన్న అక్కా! నీమీద దిగులుతో అప్పుడే పోయాడు. అమ్మని మాత్రం ఇక్కడ ఒంటరిగా వుంచడం ఇష్టంలేక పల్లెటూరు పంపాను." ఆ మాట వింటూనే ఏడ్చింది భాను ప్రభ.

ఒక్కక్షణం ఆమెనలాగే ఏడవనిచ్చి "అక్కా! నీ బాధ నేను గ్రహించగలను. కాని నీ నిష్క్రమణంతో ఏర్పడే పరిణామాలని, నాన్న ఆరోగ్యస్థితిని అన్నీ కాస్త దృష్టిలో పెట్టుకుని ప్రవర్తిస్తే బాగుండేది!"

"అసలు నేను పుట్టకుండా వుంటే ఏ బాధా వుండేదికాదు సూర్యా" అంది ఏడుస్తూనే భాను.

"మన పుట్టుకలు మన చేతిలో లేవు అక్కా! మనం కావాలని ఏరికోరి పుట్టలేదు. విధి నిర్ణయం అలాంటిది. ఏడ్చి లాభం ఏమిటి?

మనస్సు కాస్త దిటవుపరచుకో!" అంటూ ఓదార్చింది సూర్యమిత్ర. భానుప్రభ పిల్లాడెందుకో ఏడవడం గమనించి వెళ్ళి యెత్తుకుంది.

"బాబుకి పేరు ఏం పెట్టావక్కా!" అంది యెత్తుకుంటూ సూర్య.

"బాబు అనడమే! పేరేం పెట్టలేదు."

"ఇంతకీ ఎక్కడుంటున్నావక్కా!"

"న్యూఢిల్లీలో!"

"అక్కడేం జాబ్ చేస్తున్నావు?" కుతూహలంగా అడిగింది.

"బాంక్‌లో పనిచేస్తున్నాను."

"సంతోషం-నువ్వు కనిపించడమే నాకు గొప్ప ఆనందకర విషయం."

"నీ ప్రకటన అని అనుకోలేదు. అది భూపాల్ వేసిందే అనుకున్నాను. అతనికి బుద్ధివచ్చి ఏలుకుంటాడనే సంతోషంతో యిలా వచ్చాను" అంది బాధగానే.

ఆ మాటకు తల వంచుకుంది సూర్యమిత్ర.

అక్కకి అతనంటే వల్లమాలిన అభిమానం వుంది. అతగాడు తనకి చేసిన అపకారం తెలిస్తే ఇంత ప్రేమా చూపించగలదా అతని మీద? అనుకుంటూ సాలోచనగా ఆక్కయ్యకేసి చూసింది.

తన ప్రశ్నకు ఆమె ఏమి సమాధానం చెబుతుందోనన్నట్టు అప్పుడే భానుప్రభ కూడా చెల్లెలికేసి చూసింది.

ఆ చూపులో భావం గమనించిన సూర్యమిత్ర "కొన్ని కారణాలవల్ల నువ్వు జీవించి వున్నావో లేదోనన్న సంశయంతో ఆ విధంగా ప్రకటన వేయించవలసి వచ్చింది. అదిప్పుడిప్పుడే నీకు చెప్పలేను. నువ్వు కానరాకపోతేమటుకు ఈసరికా భూపాల్ పంచభూతాల్లో కలిపివుండేవాడు. ఇది మటుకు ష్యూర్" అంటూ విసురుగా వంట గదిలోకి వెళ్ళిపోయింది.

చెల్లెలి మాటలు వింటూ షాక్ తగిలినదానిలా అయిపోయింది భాను. 'తన చెల్లెలికి అంత కక్ష వుందా అతని మీద' అనుకుంది. బయటకు వెళ్ళిన ఉత్తమచంద్ర తిరిగి వచ్చాడు. వస్తూ బాబుకి

బిస్కట్లప్యాకేట్ ఒకటి తెచ్చి యిచ్చాడు. ఆ కాస్తకే సంతోషించింది భానుప్రభ. బాబుని వడిలో కూర్చోబెట్టుకుని అతనే ఒక్కొక్క బిస్కట్టు తుంచి నోట్లో పెడుతూ ఆలోచిస్తున్నాడు. భానుప్రభ ధోరణి చూస్తే భూపాల్ తనని పిలిచాడన్న ఆశతోనే వచ్చిందని స్పష్టమవుతోంది. ఆమె తనని అదే ప్రశ్న అడిగితే తనేం జవాబు చెబుతాడు? తీగ లాగితే డొంక కదుల్తుందని తన బతుకంతా ఈవిడ ముందు మళ్ళీ ఏకరూ పెట్టాల్సి వచ్చేట్టుంది. అనుకున్నాడు అతను నిట్టూర్చుతూ.

అతననుకున్నట్టు నెత్తిన బాంబు పడనే పడింది.

"మీరు సూర్యమిత్ర స్నేహితులో ప్రేమికులో నాకు తెలియదుగాని నా విషయంలో మటుకు మీరు చొరవ తీసుకున్నారని అనక తప్పదు" అంది భాను.

"నిజమే! పరిస్థితులలాంటివి. సూర్యమిత్రకి భూపాల్‌లాంటి దుర్మార్గుడు జీవించి వుండాలన్న కోరిక ఏమాత్రమూ లేదు. అతన్ని నాశనం చేయడానికి ఆమె ఎన్నుకున్న వ్యక్తిని నేను. కారణం అతని అన్యాయాలకి బలి అయిన వారిలో నేనూ ఒకడిని కనుక. కాని నేనే మీరు జీవించి వుండి బాబో-పాపో పుట్టివుంటే అనే పాయింట్ ఆలోచించి అతన్ని చంపడానికి ముందు మీ వునికి తెలుసుకుందామని ప్రకటన చేశాను. ఒకవేళ అతని మరణం మీకు బాధాకరంగా పరిణమిస్తే మళ్ళీ అదో నేరం అవుతుందన్న భయంతో" అంటూ ఆగాడు.

"మనిషిని చంపడం నేరంకాదా?" కరుగ్గా అడిగింది భాను.

ఆ మాట వింటూ చర్రున లోపల్నించి వచ్చేసింది సూర్యమిత్ర.

"అవునే! ప్రాణం తీయడం నేరమే! కాని అతగాడు డబ్బున్న ఆసామీ కదూ ఏం చేసినా న్యాయం కిందికే వస్తుంది. అసలలాంటి వూహలు ఎందుకు వచ్చాయో కారణం మాత్రం ఆలోచించవు" అంది రోషంగా సూర్యమిత్ర.

చెల్లెలి కోపాన్ని చూసి కాస్త జంకింది భానుప్రభ.

ఉత్తమచంద్ర ఆ యిద్దర్నీ మార్చి మార్చి చూడసాగాడు. ప్రపంచంలో వున్న ముగ్ధత్వం అంతా మూసబోసుకున్నట్టున్న భాను ప్రభ-అగ్నిశిఖలా ప్రజ్వలిస్తున్న సూర్యమిత్ర. ఒకరిలో క్షమాగుణం మరొకరిలో ప్రతీకారేచ్ఛ. ఈ ఇద్దరిమధ్యా దిక్కుతోచని తను.

"నేను బ్రతికే వున్నాను. నాకు కొడుకూ పుట్టాడు. ఇవన్నీ మీరు చూశారు. ఇంక నా దారిన నేను పోతాను. మీ ఇష్టంవచ్చినట్లు చేసుకోండి" అంది చిన్నబుచ్చుకుంటూ భానుప్రభ. అలా అంటు న్నప్పుడామె కళ్ళల్లో నీళ్ళు తిరగడం స్పష్టంగా చూశాడు ఉత్తమ చంద్ర.

'మధురమయిన ఈమె అనురాగామృతాన్ని ఆ భూపాల్‌కి కాక మరెవరికి పంచినా ఈమె జీవితం మూడు పువ్వులు ఆరు కాయలుగా వుండేది. ఆ దేవుడు ఇలా ఎందుకు ఆటలాడుకుంటాడో ఎవరి వూహకీ అందని విషయం. అమాయకులంటే ఆయనకీ విలాసమే కాబోలు' అనుకుంటూ ఓ దీర్ఘనిశ్వాసం విడిచి "మీరు తొందర పడకండి. స్థిమితంగా రాత్రికి ఆలోచించుకుందాము. మీ మనస్సుకు కష్టం కలగకుండా పరిష్కారం కావాలనే నా కోరిక" అన్నాడు ఉత్తమచంద్ర.

ఆ మాటకి కాస్త శాంతించింది భానుప్రభ

ఆ పూట ఇంటికి వెళ్ళి భోజనంచేసి మళ్ళీ రాత్రికి వచ్చాడు ఉత్తమచంద్ర. అప్పటికి అక్కచెల్లెళ్ళిద్దరూ భోజనాలు పూర్తి చేశారు. బాబు పడుకుని నిద్రపోతున్నాడు.

ఉత్తమచంద్ర రాగానే ప్రాణం లేచివచ్చినట్లయింది భాను ప్రభకి. ఆమె కళ్ళకి తన స్వంత చెల్లెలికంటే అతనే ఆప్తుడిలా కనిపిస్తున్నాడు.

"చూడండి భానుప్రభగారూ! మీరు కొన్ని ప్రశ్నలకి సూటిగా సిగ్గుపడకుండా సమాధానం చెబితే నాకు వుపకారం చేసినవా ళ్ళవుతారు".

"అడగండి. నా బతుకెలాగో పలచనదనే అయింది. ఇంక సిగ్గుపడి ప్రయోజనం ఏమిటి?"

"అయితే వినండి. మీరు భూపాల్‌ని ఇప్పటికీ మనసారా ప్రేమిస్తున్నారా?"

భానుప్రభ క్షణం మాట్లాడలేకపోయింది.

"బాబు పుట్టకపోతే ఎలా వుండేదోగాని వాడు పుట్టాక మువ్మూర్తులా అతని పోలికలే పంచుకున్న పిల్లాడిని చూశాక ఆయన్ని మర్చిపోలేకపోతున్నాను."

"అక్కా! ఏదో పిచ్చిభ్రమ కాని అతనీ బిడ్డని తన బిడ్డగా అంగీకరించి ఆదరిస్తేగదా నీ మనస్సుకు న్యాయం జరిగేది?"

భానుప్రభ దిగులుగా చూసింది.

"అతని కేనాటికయినా మనస్సు మారుతుందనే నా నమ్మకం"

"నీ నమ్మకం వమ్ము కాకూడదనే నా కోరిక. కాని బంగారపు పళ్ళానికయినా గోడవాలు కావాలని మీకు ఏదో ఆధారం వుండాలి. అతన్ని మీవాడుగా చేసుకోవడానికి ఏదీ లేకపోతే మీ చెల్లెలన్నమాటే ఖాయం."

"ఇదిగో అతనిచ్చిన డైమండ్ రింగ్! అన్నింటికంటే బలమైన ఆధారం మరొకటి వుంది. ఆ రోజు నేను వాళ్ళింటికి వెళ్ళినప్పుడు ఆయన టేప్ రికార్డర్ పెట్టారు. అది నాకని కేటాయించిన గదిలో పెట్టుకున్నాను. అంతేకాదు ఆయన నా గదిలోకి వచ్చినప్పుడు ఆయన ఈ వుంగరం పెడుతూ అన్న మాటలు అన్నీ రికార్డయ్యే వున్నాయి. అది నాతో తెచ్చుకున్నాను. ఆ తర్వాత కూడా ఆయన అడిగితే చెప్పడానికి సమాధానం ఆలోచించిపెట్టినా అతను అడగలేదు. అది ఇంతవరకూ నాకూడా వుంది."

ఆ మాట వింటూ హుషారుగా లేచాడు ఉత్తమ్.

"వెరీగుడ్ భానుప్రభగారూ! నిజంగా మీరు చాలా తెలివిగలవారని ఈ ఒక్కదాంతోనే ఋజువవుతోంది. ఇంక మీరేం భయపడవలసిన పనిలేదు. భూపాల్‌ని సుప్రీమ్‌కోర్టుకు వెళ్ళినా మీ వ్యక్తిగానే తీర్పు చెబుతారు. ఇంక మీరు బెంగపడకండి."

"అంటే?"

"అంటే ఏముంది? మంచి లాయరుని కుదుర్చుకుని అతని

మీద కేసు పెట్టటమే?"

ఆ మాటకి ఏమంత వుత్సాహం చూపించలేదు భానుప్రభ. "ఆయన హృదయంలో ప్రేమకలగాలి-నన్ను ఏలుకోవాలిగాని కోర్టులు హక్కుల్ని తిరిగి ఇవ్వగలవేగాని మనసుల్ని కలపగలవాని."

"కలుపుతారు. ముందు బలవంతంగా చేసినట్టున్నా ఆ తర్వాత అలవాటయి మీరే కలిపి మెలపి వుండవచ్చు."

భానుప్రభ మౌనం వహించింది.

"బాబు భవిష్యత్తుకయినా అతన్నించి పరిహారం కోరడం మంచిది?"

"నాకు ఆయనగారు మనోవర్తి యివ్వకపోతే వాడు, నేనూ బతకలేమా?"

"బతకగలరు.కాని నలుగురిలో అతని కొడుకని ఋజువయితే బాబు భవిష్యత్తుకి కొంత మేలుగదా!"

భానుప్రభ అతను చెప్పేది శ్రద్ధగా వింటోంది.

"మీరు కూడా ఆలోచించండి. అతని ఆస్తిలో మీ బిడ్డకి వాటా కావాలని అడగద్దు. అతని బిడ్డగా నలుగురూ చెప్పుకుంటే చాలు."

భానుప్రభ ఒక్కక్షణం ఆలోచనలో పడింది.

"ఇప్పటికిప్పుడు చెప్పక్కరలేదు.స్థిమితంగా ఆలోచించుకునే చెప్పండి" అన్నాడు ఉత్తమచంద్ర.

"ఇంతకీ మీ పేరు ఏమిటి?" అని అడిగింది భానుప్రభ నవ్వుతూ.

"నా పేరు ఉత్తమచంద్ర. కాని కారణాంతరాలవల్ల చంద్ర బాబు అనే చెప్పుకుంటున్నాను."

"ఇంతకీ భూపాల్‌గారు మీకు చేసిన అపకారం ఏమిటో?" అని అడిగింది భాను.

"లేని నేరారోపణలతో జైలుకు పంపారు. ఇన్సూరెన్సు కంపెనీకి అనుకూలంగా ఫైర్ యాక్సిడెంటును గురించి చెప్పానని. కాని నేను మాత్రం ఆ జైలు తప్పించుకు వచ్చాను. నా కోసం పోలీ

సులు వేటాడుతూనే వున్నారు" అన్నాడు దుఃఖవదనంతో. అది చూసి జాలిపడింది భానుప్రభ.

"ఏనాటికయినా నిజం నిరూపించబడి మీ నిర్దోషిత్వం నలుగురికీ బహిర్గతం కాకపోదు" అంది ధైర్యం చెబుతున్నట్టు.

"నిజమా! అయ్యో రామా! అది మసిపూసి మారేడుకాయ చేసి నా పీకలమీదకి తెచ్చి బిగించారు. అందులోంచి బయటపడటం సర్వకల్ల" అన్నాడు నవ్వుతూ.

ఆ నవ్వు వెనక గల బాధను స్పష్టంగా పసిగట్టింది భాను.

"వింటున్నావా అక్కా! ఆయన పైకి నవ్వుతున్నా మనసులో ఎంత బడబానలం దాగివుందో! ఇన్ని బాధలకి గురి చేసిన ఆ భూపాల్‌ని ఎందుకు వదలాలో చెప్పు" అంది తీవ్రంగానే సూర్యమిత్ర.

భానుప్రభ మాట్లాడలేదు. ఆమెకీ కష్టంగానే వుంది. కాని ఏం చేయగలదు? రోలు వచ్చి మద్దెలతో చెప్పినట్టుంది.

"మనిషికి బుద్ధి చెప్పవచ్చు. కాని చంపడం సరయిన పద్ధతి కాదు. చట్టాన్ని మన చేతుల్లో పెట్టుకునేకంటే మననే కోర్టుపాలు చేసి అపనిందల నంటగట్టాడో, ఆ కోర్టులోనే నిజం వెల్లడించుకోవడం మంచిది. మన అదృష్టం బాగుంటే మనకి అనుకూలంగా వుంటుంది. లేకపోతే అంతే" అంది భానుప్రభ.

"అందుకే భానుప్రభగారూ! ముందు మీరు అతన్ని ఎదుర్కోండి కోర్టులో. మిగిలినదంతా నేను చూసుకుంటాను" అన్నాడు ఉత్తమచంద్ర.

"ఏం చూసుకుంటారు? మీరు కనబడగానే ముందు కోర్టులో దావా వేస్తారు. జైల్లో కూర్చోపెడతారు. అప్పుడనుకున్నవన్నీ తలక్రిందులవుతాయి" విసుగ్గా అంది సూర్యమిత్ర.

"సూర్యా! నీకు అతనంటే ఎందుకంత ఆగ్రహం?"

"ఎందుకా? నీకోసం నీ స్థానంలో ఉద్యోగం నేను వెలగబెట్టాను. అతను నన్ను వలలో వేసుకోవడానికి శతవిధాల ప్రయత్నించి లొంగలేదని నిద్రమాత్ర లుపయోగించి నన్ను పాడుచేశాడు"

అంది రోష కషాయత నేత్రాలతో చూస్తూ.

ఆ మాట వినేసరికి మాడిపోయింది భానుప్రభ ముఖం.

"నువ్వు ప్రాణప్రదంగా చూస్తున్న ఆ వ్యక్తి ఎంత కిరాతకుడో అర్థం అయిందా? అందుకే అతగాడిని ఖూనీచేసి పారేయాలన్నది."

"నీ యిష్టం చెల్లీ!" అన్నది భాను ఎటో చూస్తూ.

చివరకి ఆలోచించి ఆలోచించి భూపాల్‌మీద కేసు పెట్టడానికే నిర్ణయించారు ముగ్గురూ.

ఈ నిర్ణయానికి వచ్చి పడుకున్నా ఎవరి మనసులో వారికి భరించలేని సంఘర్షణ చెలరేగుతోంది.

ఒకప్రక్క తన ప్రతిజ్ఞ! మరోపక్క అక్క, బాబుల దీన వదనాలు. మరోప్రక్క ఉత్తమచంద్ర. వీటన్నింటితో మనసు పాడయింది సూర్యమిత్రకి. ఏ కోశానా జాలిపడి అతన్ని తేలిగ్గా వదలాలనిలేదు ఆమెకి.

భానుప్రభ ఆపుకుందామన్నా ఆగని దుఃఖం వస్తోంది. చివరకి తనింతకాలమూ ఏ ఆశతో జీవిస్తూ వచ్చిందో దానికి వ్యతిరేకంగా జరుగుతున్న సంఘటనలు చూస్తూంటే మనసు కలత చెందుతోంది. తన స్వంత చెల్లెలు జీవితాన్ని పాడుచేశాడన్న మాట వింటున్నకొద్దీ భూపాల్‌ని సమర్థించలేకపోతోంది. మహిషాసుర మర్దనిలా వున్న చెల్లెలి చేతిలో తన పసుపు కుంకుమలు ఇమిడి వున్నాయి. స్త్రీకి శీలం ఎంత ముఖ్యమైనదో-పసుపు కుంకుమ లెంత ప్రాణమైనవో ఆ రెండింటికీ సమరం సంభవిస్తే తనేం చేయగలదు ఏడవడం తప్ప? ఇలా వున్నాయి భాను ఆలోచనలు.

విభిన్న దృక్పథాలు గల ఈ అక్క చెల్లెళ్లమధ్య చిక్కుపడ్డాడేమిటి తను? తనసలేమనుకుంటూ జైలునించి తప్పించుకు వచ్చాడో అది కాస్తా అడుగున పడి విచిత్రమైన పరిస్థితుల్లో ఇరుక్కుపోయాడు. ఓ ప్రక్క భానుమీద జాలి, మరోప్రక్క భూపాల్ అంటే రగులుతున్న ద్వేషం. ఈ రెంటికి మధ్య మనస్సు విలవిల్లాడుతోంది అతనికి.

ఇలా ఎవరి మటుకూ వారు ఆలోచనలతో వుండగా భళ్ళున తెల్లారిపోయింది.

# 10

విజయవాడ లాయరు కల్యాణచక్రవర్తి నుంచి లాయరు నోటీసు అందుకున్నాడు భూపాల్. రోటిలో తల దూర్చి రోకలి పోటుకు వెరవడం దేనికన్నట్టు విజృంభంగా వుంది భానుప్రభ.

నోటీసు అందుకోగానే తోక తొక్కిన తాచులా లేచాడు భూపాల్. వెంటనే కారు వేసుకుని తిన్నగా బెజవాడ వచ్చాడు. విజయవాడలో మంచి పేరున్న లాయరు కళ్యాణచక్రవర్తి బిల్డింగ్ కనుక్కోవడం ఏమంత కష్టం కాలేదు భూపాల్‌కి. అతను వచ్చే సరికి ఎవరో క్లయింట్స్‌తో మాట్లాడుతున్నాడు కళ్యాణచక్రవర్తి.

తన విజిటింగ్ కార్డు లోపలకి పంపించాడు. బయట సోఫాలో కూర్చుని వెయిట్ చేయవలసిందిగా కబురు పంపాడు చక్రవర్తి. తన పేరు వినగానే ఆదరా బాదరా పరిగెత్తుకుంటూ వస్తాడనుకున్నందుకు తీవ్ర ఆశాభంగం కాగా విధిలేక సోఫాలో కూలబడ్డాడు భూపాల్. అతని బుర్ర గిర గిరా తిరిగిపోతోంది. 'ఏనాడో చచ్చిందనుకున్న భానుప్రభ బ్రతికి వుండటం ఏమిటి? బ్రతికుంది సరే ఏదో మూల పడివుండక తనపై కేసు పెట్టడం ఏమిటి? దీని వెనకాల ఎవరి హస్తమన్నా వుందా? వుంటే ఎవరు? కేసు పెట్టినంతమాత్రాన ఆవిడ గారిని భార్యని చేసుకుంటాడనేనా? కొడుకును చూపి నెత్తికెక్కించుకుంటాడనా? ఏమవి విజృంభించింది ఇలాగ' అతనిలా ఆలోచనలో వుండగా ఎర్రగా, నల్లని కోటుతో స్థురద్రూపంతో చిరునవ్వు ముఖంతో ఎదురయ్యాడు లాయరు కళ్యాణచక్రవర్తి.

అతన్ని చూడగానే అప్రయత్నంగా లేచి నిలబడి విష్ చేశాడు భూపాల్.

"కూర్చోండి" అంటూ అతని ఎదురుగా సోఫాలో కూర్చున్నాడు లాయర్.

"మీరు పంపిన లాయరు నోటీసు అందింది. భానుప్రభని ఓ సారి చూడవచ్చునా?" అని అడిగాడు.

"చూసే అవకాశంలేదు. మీరు నోటీసుకి సరైన సమాధానం చెప్పాలి" అన్నాడు గంభీరంగా.

"ఆమె ఏ కోర్టుకు వెళ్ళినా నాకేం భయంలేదు. ఆమెని భార్యగా స్వీకరించడం అసంభవం. నేనూ లాయర్ని పెట్టుకోగలను" రోషంగా అన్నాడు.

"ఓ.యస్. పెట్టుకోండి. మేము కాదనలేదు. కానీ నోటీసుకు జవాబు రాయాలి. అది మాత్రం పంపండి" అన్నాడు కళ్యాణ చక్రవర్తి.

"పంపిస్తాను. ఈ వూళ్ళోనే మంచి లాయర్ని కుదుర్చుకుని మరీ పంపిస్తాను" అంటూ బుసలు కొడుతూ వెళ్ళిపోయాడు భూపాల్.

అతను తిన్నగా తన తోటలోని బంగళా దగ్గరకు వెళ్ళి ఆ పూటే మంచి లాయర్ని మాట్లాడి అతని ద్వారా నోటీసు పంపించాడు.

"తాను భానుప్రభని పెళ్ళాడలేదని-ఆమె ఏనాడో ఉద్యోగం మాని వెళ్ళిందని ఆ బిడ్డ తనబిడ్డ కాదని."

అది చదివి వినిపించాడు భానుప్రభకి. అతనన్న ఆఖరి మాటకి మండిపోయింది భానుప్రభ.

"ఎందుకు కాదంటాడో నేను చూస్తాను" అంటూ అగ్రహోదగ్రురాలైంది.

చివరికి భానుప్రభ కోర్టులో దావావేసింది భూపాల్‌మీద. హైదరాబాద్‌లో భూపాల్‌కి సమన్లు అందాయి. దాంతోపాటు మరో పర్సనల్ లెటర్ కూడా అందింది.

శ్రీ భూపాల్‌గారికి:

నా మీద మీకు ఆగ్రహం కలిగితే కలగవచ్చు-కోర్టుకు వెళ్ళానని. కాని ఒక్క విషయం మీరు గ్రహిస్తే ధన్యురాలిని. ఏదయినా స్త్రీ భరించగలదు-భర్త తిరస్కరించినా సహించగలదు కాని శీలం మీద నిందవేస్తేమటుకూ భరించలేదు. మీకు నేను గర్భవతినంటూ రాసిన వుత్తరం

అందింది. అది చదివారు. ఈ నాడు వాడు నా బిడ్డ కాదనడం మాత్రం సహించలేకే నేను కోర్టులో కేసుపెట్టింది.

శలవు—

భానుప్రభ.

ఆ ఉత్తరం చదివి క్షణం ఆలోచనలో పడినా మౌనం వహించాడు భూపాల్. ఆ రోజు కోర్టు సమనుల ప్రకారం కోర్టుకి హాజరయ్యాడు. అక్కడ పిల్లవాడి నెత్తుకుని వుంది భానుప్రభ. భూపాల్‌ని చూసి చిన్నగా మందహాసం చేసింది. ఆమెని ఆమె చేతిలో బిడ్డని క్షణం పరకాయించి చూశాడు భూపాల్. బాబు పచ్చగా దబ్బపండులా మెరిసిపోతున్నాడు. ఆ పిల్లాడిలో తన పోలికలు స్పష్టంగా కనిపించాయి.

విచారణ ప్రారంభమయింది.

"మీ పేరు."

"భానుప్రభ."

"మీ రెక్కడ పని చేస్తున్నారు?"

"ఢిల్లీలో."

"వెనక ఎక్కడ పని చేశారు?"

"హైద్రాబాద్‌లో ప్రసాద్ కార్పొరేషన్‌లో శ్రీ భూపాల్‌గారికి పి.ఏ.గా వుండేదాన్ని."

"పి.ఏ.గా వున్నప్పుడు మీకు భూపాల్‌తో సంబంధం కలిగిందా?"

"అవును. నా కోసం ఆయన చాలాసార్లు ప్రయత్నం చేశారు. కాని పెళ్ళికాకుండా ఎటువంటి సంబంధాలూ ఇష్టంలేదని నేను తప్పించుకుంటూ వస్తున్నానని ఈ డైమండ్ రింగ్ వేలికి తొడిగి మనకి గాంధర్వ వివాహం జరిగినట్లేనని నన్ను నమ్మించి వశపరచుకున్నారు" అంటూ భూపాల్‌కేసి సూటిగా చూసింది.

భూపాల్ ముఖం ఎర్రబడింది.

ఆ వుంగరం కోర్టువారి ముందు ప్రవేశపెట్టబడింది.

భూపాల్ బోనులో నిలబడ్డాడు.

"మీ పేరు?"

"భూపాల్."

"వృత్తి?"

"బిజినెస్, హైద్రాబాద్‌లో ప్రసాద్ కార్పొరేషన్, మద్రాసులో భూపాల్ అండ్ కంపెనీకి మేనేజింగ్ డైరక్టర్ని."

"భానుప్రభని మీరు పి.ఏ.గా అప్పాయింట్ చేసుకున్నారా?"

"ముందు మామూలుగానే వేశాము. కాని ఆమె తెలివితేటలు చాకచక్యం చూసి పి.ఏగా వేసుకున్న మాట వాస్తవమే!"

"మీరామెని ప్రేమించారా?"

"ప్రేమించానని చెప్పలేను. కాని అభిమానం మాత్రం వుంది."

"అభిమానంతోనే ఆమెని పొందగోరారా?"

"నేనేమీ ఆమెతో ప్రేమకబుర్లు చెప్పలేదు."

"ఆమె మీ ఇంటికి వచ్చేవారా?"

"నాకు వంట్లో బాగుండకపోతే రెండుసార్లు వచ్చింది అర్జెంట్ లెటర్స్ తీసుకుని."

"అప్పుడే ఆమెని పెళ్ళాడుతానని చెప్పి మభ్యపెట్టి వశపరచుకున్నారా?"

"మభ్యపుచ్చడానికి ఆమె చిన్నపిల్ల, అమాయకురాలు కాదుగా"

"ఈ వుంగరం మీదేనా?"

"అవును."

"ఇది ఆమె వేలికి మీరు స్వయంగా తొడిగారా?"

"తొడగలేదు. ప్రెజంటేషన్‌క్రింద ఇచ్చాను."

"మీ కింతవరకూ వివాహం కాలేదు కదూ!"

"అవును."

"ఏం ప్రెజంటేషన్ క్రింద ఇచ్చారు?"

"ఆమె పుట్టినరోజు అంటే!"

"ఐ.సీ. పుట్టినరోజు ప్రెజంటేషన్‌క్రింద డైమండ్ రింగ్

తన వేలికి ధరించేది తీసియిస్తారా ఎవరైనా?"

"దాందేముంది? ఆ సమయంలో అంతకంటే తట్టకపోవచ్చు."

"ఇప్పుడు భానుప్రభగారు చెప్పినదంతా అబద్ధమేనంటారా?"

"ఆ! అక్షరాలా అబద్ధమే-నన్నేదో అల్లరిపాలు చెయ్యాలన్న ఉద్దేశం తప్ప మరేంలేదు."

భానుప్రభ నిశ్చలంగా చూసిందతని వంక.

"ఏవమ్మా మీరేం అంటారు?"

"ఆయన్ని అల్లరిపెట్టాలన్న ఉద్దేశం నాకు లేదు. ఆయన ఆస్తిపాస్తుల్లోనూ మాకు వాటాలక్కర్లేదు. భగవంతుడి దయవల్ల నా తండ్రి చెప్పించిన విద్యవుంది. బ్యాంక్‌లో వుద్యోగం వుంది. నా బిడ్డని నేను పోషించుకోగలను. కాని ఈనాడంటే వాడు పసివాడు కాని రేపు వూహ తెలిశాక నా తండ్రి ఏడి అని అడిగితే నేను చెప్పాలి. లోకంలో భర్తృ పరిత్యక్తలయినా ఫర్వాలేదుగాని భర్త లేకుండా బిడ్డని కన్నదన్న మాట ఎంత చులకనయిందో నాకు తెలుసు. భవిష్యత్తులో బాబుకెంత నష్టమో మీకూ తెలుసు. అయినా బిడ్డకి తండ్రినని ఈ కోర్టు సమక్షంలో వప్పుకుంటే చాలు. నేను కేసు ఉపసంహరించుకుంటాను" అంది భానుప్రభ.

కేసు మరో రోజుకు వాయిదా పడింది.

లాయరు కళ్యాణచక్రవర్తికి మద్రాసు హైకోర్టులో వాదించే అవకాశం వుంది కనుక తన గోడుకూడా ఆయనకే చెప్పకుందామను కున్నాడు ఉత్తమచంద్ర.

ఆ మాట తట్టగానే వెళ్ళి కల్సుకున్నాడు.

"నన్నిలా దొంగకేసులతో జైలుపాలుచేస్తే తప్పించుకు వచ్చాను. నా తరఫున మీరు పనిచేసి నాకు న్యాయం చేకూర్చాలి" అంటూ ప్రాధేయపడ్డాడు.

అంతా విన్న కళ్యాణచక్రవర్తి "ఉత్తమచంద్రా! నీ కేసు తీసుకోవడానికేం అభ్యంతరంలేదు. పైగా నీపట్ల నాకు సానుభూతి కూడా వుంది. కాని సత్యం వెలికి తీసేముందు నువ్వు అనవసరంగా జైలునించి వచ్చి దోషివయ్యావు కనుక నువ్వు మద్రాసులో పోలీస్

స్టేషన్‌లో లొంగిపో. అక్కడినించే నువ్వు నీ తరఫున కేసు పంప వచ్చు. మిగిలిన విషయాలన్నీ నేను చూసుకుంటాను. నీకు తగిన విధంగా న్యాయం చేకూర్చుతాను" అన్నాడు.

అందుకు అంగీకరించాడు ఉత్తమచంద్ర.

ఆ మాట విన్న సూర్యమిత్ర చిత్తరువయింది. "మీరు వెళ్ళి పోతే మాకు రక్షణ ఎలాగ?"

సూర్యమిత్ర మాటకి ఫక్కున నవ్వాడు ఉత్తమచంద్ర. "కోటి సూర్యప్రకాశానికి ఎవరు తోడు కావాలి? నువ్వే న్యాయంగా ఆలోచిస్తే నాకంటే ధైర్యస్తురాలివి. నేనేదో చిన్న అవకాశంతో బయట పడ్డానేగాని తెగించి ఒక్కపనీ చేయలేకపోయాను."

సూర్యమిత్ర మాట్లాడలేదు.

భానుప్రభకి ధైర్యం చెప్పి వాయిదా రోజున కోర్టుకు హాజరు అవమని మరీ మరీ హెచ్చరించి వెళ్ళిపోయాడు మద్రాసు.

చివరకి అక్కయ్య పుణ్యమాని మళ్ళీ జైలుకు వెళ్ళాడు ఉత్తమచంద్ర.

'అతని అదృష్టం బాగుంటే కళ్యాణచక్రవర్తి అన్న మాటకి నిలబడితే తిరిగివస్తాడు. లేకపోతే ఇంక అంతే! అతని జీవితం అంతటితో సరి' అనుకుంది బొటబొటా కన్నీరు కారుస్తూ.

'తన హృదయం శిలాసదృశం అని. తన మనస్సు కఠినమని అందులో ప్రేమ-అనుభూతులు-స్పందన ఏవీ లేవని అందరూ అనుకో వచ్చు. వూరికే పగ సాధించే మహమ్మారిగానో, రాక్షసిగానో భావించ వచ్చు. కాని-తనకీ స్త్రీ సహజమైన లాలిత్యం మార్దవం-ప్రేమ-అనురాగం అన్నీ వున్నాయని-అవి అన్నీ ఉత్తమచంద్రవేనని యెవరికి తెలుసు? అతనికిష్టం అయినా లేకపోయినా తనమీద అతనికి అనురాగం జనించినా జనించకపోయినా తన ప్రేమ మాత్రం అతని మీదేనని. ఏనాటికైనా అతను తన మనస్సెరిగి తనని చేపట్టితే తాను ధన్యురాలే. లేకపోతే జీవితాంతం అలా బ్రహ్మచారిణిగానే గడుపు తుందిగాని మరో మగవాడికి మనసివ్వడం అనేది సర్వకల్ల.

తమ జీవితాలేమిటోగాని అక్క వలచినవాడు అలా

అయ్యాడు. తను వలచినవాడు ఇలా అయ్యాడు. చివరికి మా బతుకు లిలా వంటరిగానే గడిచిపోతాయి కాబోలు. ఛీ! ఇలా అందరిలా సంసారాలు, భర్త, పిల్లలు అనే సంబంధాలు లేకుండా మొండి బతుకులీడవవలసి రావడానికి కారణం ఎవరు? అడుగో! ఆ భూపాల్ గాడు! వాడివల్ల, మా అందరి జీవితాలూ తల్లక్రిందులయ్యాయి.

ఎలాగో ఏలుకోనని స్పష్టంగా చెబుతున్నా అక్కయ్య చాదస్తం తగలడా వినదు. ఇంత మొండిదని తెలిస్తే అసలా పేపర్లో ప్రకటన వేయించకుండానే వుండేది. విశేషంగా భూపాల్‌ని చంపి పారేసి తను—ఉత్తమచంద్రని పెళ్ళాడి ఈ వూళ్ళోనే ఇలానే హాయిగా కాపురంపెట్టి సుఖంగా బతికేవాళ్ళు, అనుకుంటూ తపీమని లేచి నిలబడింది.

చివరికి ఎటు చూసినా భూమి గుండ్రంగా వున్నదని భూపాల్ మీదకే తిరుగుతోంది. ఏది ఏమైనా తను ఆ భూపాల్‌ని ఇంక వదిలి వూరుకోకూడదు. అట్టో ముక్కో తేల్చిపారేయాలి. తన వలపు తగల పడిపోయాక-తను ప్రేమించిన తన హృదయ సామ్రాజ్ఞ చక్రవర్తి నాలుగుగోడల మధ్యకి వెళ్ళిపోయాక తనింక యెవరినీ క్షమించవలసిన పనిలేదు. అందులో ఆ దుర్మార్గుడిని అసలు మన్నించదు. ఈ ఆలోచన అంతకంతకూ తీవ్రరూపం దాల్చింది. ఇంతకీ ఆ భూపాల్ యెక్కడ చచ్చాడో! ఈ విజయవాడలో ఆ తోటలో ఆ బంగళాలోనే చచ్చాడో—ఆ హైదరాబాద్ తగలబడ్డాడో! ఎలా తెలుస్తుంది?

ఎలా తెలిసేదేముంది? వున్నాడుగా ఆ పాపాలభైరవుడు. భీమసింగ్. వాడిని పట్టుకుంటే సరి. ఉంటే వున్నాడని చెబుతాడు—లేకపోతే లేడని చెబుతాడు. ఈ మాట తట్టగానే మెల్లగా చీర మార్చుకుని సింపుల్‌గా ముస్తాబయి ఆ తోట గుర్తు వెతుక్కుంటూ వెళ్ళింది సూర్యమిత్ర.

భీమసింగ్ ఆమెని చూసి తెల్లబోయాడు.

"ఏం భీమసింగ్! మీ అయ్యగారులేరా?" అని అడిగింది నవ్వుతూ.

"లేరమ్మా!" అన్నాడు యింకా ఆశ్చర్యంనించి తేరుకో

కుండానే.

"ఏమిటీ నన్ను చూసి మరీ అంత ఆశ్చర్యపోతున్నావు? మీ అయ్యగారితో చిన్న పనివుండి వచ్చాను. ఇప్పట్లో ఇక్కడికి రారంటావా?" అని అడిగింది.

"రాకేం వస్తారు. రేపుగాని ఎల్లుండిగాని."

"అయితే సరే! సూర్యమిత్ర వచ్చివెళ్ళిందని ఎల్లుండి వస్తానని చెప్పు."

అలాగేనన్నట్టు తల వూపాడు భీమసింగ్. కాని అతని బుర్ర మాత్రం పని చెయ్యడంలేదు.

సూర్యమిత్ర వెళ్ళిపోయింది.

'ఈ పిల్లతో తన యజమాని ఎంత దండాగొండీలు పడ్డాడో తనకి తెలుసు. ఆ నాడు ఎంత పొగలు-సెగలు గ్రక్కుతూ ఇంటికి వెళ్ళిపోయిందో తనకి తెలియకపోతేగా! మరి అలాంటిది నేడు వెతుక్కుంటూ ఎందుకు వచ్చినట్టు?'

ఆ మాటే అన్నాడు లక్ష్మితో.

"రానురాను నీకు బుర్ర పనిచేయడంలేదు. అయ్యగార్ని చూస్తే ఏ అమ్మాయి ఐస్ అయిపోదు? ఏదో ఈ కాలం చదువుకున్న పిల్ల కనక కాస్త గింజుకుంటుంది. అంతేగాని సిరి వస్తుంటే మోకాలడ్డం పెడతారా?" అంది మందలిస్తున్నట్టు.

భార్యామణి మాట విన్నాక అది నిజమే అయివుంటుందని భీమసింగ్ కూడా నమ్మాడు. ఆడవాళ్ళ మనస్సులు ఆడవాళ్ళకి తప్ప ఎవరికి తెలుస్తుంది? అనుకుంటూ సమాధానపడ్డాడు.

ఆ మర్నాడే వచ్చాడు భూపాల్. ఆయనగారి రాకకోసం ఎదురు చూస్తున్న భీమసింగ్ అతను కాఫీత్రాగి స్థిమితపడగానే పక్కకి చేరాడు. అది చూసి "ఏమన్నా విశేషాలున్నాయా?" అని అడిగాడు భూపాల్.

ఉన్నాయన్నట్టు తలవూపి "ఆ నాడు ఇక్కడ మీరు అన్నంనీళ్ళు ఇవ్వకుండా గదిలో పెట్టినమ్మాయి వచ్చివెళ్ళింది" అంటూ మెల్లగా అందించాడు.

ఆ మాట వింటూ బాంబు పేలినవాడిలా అదిరిపోయాడు భూపాల్.

"మళ్ళీ అదెందుకు తగలడింది?" అని అడిగాడు విసుగ్గా.

"ఏమో బాబూ! ఏదో గింజుకున్నా మీ లాంటి బంగారు పిచ్చుక ను ఎవరు వదులుకుంటారు?" అని ఎదురుప్రశ్న వేశాడు భీమసింగ్.

"అదా! అది పెంకిఘటంరా! అలా యిలా లొంగే ఘటం కాదు. ఇప్పుడు మళ్ళీ యేం కొంప అంటించడానికి దాపరించిందో!" అన్నాడు బెరుగ్గా ఇప్పటికి భానుప్రభవల్ల జరుగుతున్న గొడవలు తలచుకుని.

"అదేం కనబడలేదు బాబూ! నవ్వుతూ మాట్లాడింది. ఎల్లుండి ఉదయం వస్తానని మిమ్మల్ని వుండమని చెప్పి వెళ్ళింది" అన్నాడు భీమసింగ్!

"ఏమో! దానిలాంటి ఆడదాన్ని అసలు నమ్మకూడదు. నవ్వుతూ నవ్వుతూనే గొంతుకి ఓ ఉరిత్రాడు బిగించిపోతారు? అయినా రేపు వుదయం వస్తానందిగా! అయినా మనం మన జాగ్రత్తలో వుండాలి."

అంటూ తగిన సూచన లిచ్చాడు భూపాల్.

ఈసారి అతనితో హేమలత రాలేదు. ఈమధ్య ఎక్కడికి వెళ్ళినా హేమలత అతని కూడా వుంటూనే వుంది. ఇటీవలగా భానుప్రభ కేసు పెట్టడం లీలామాత్రంగానైనా ఆమె గ్రహించింది. దాంతో భూపాల్ తను అనుకున్నంత మంచివాడు కాదని, ఆడపిల్లల విషయంలో అతన్ని మించిన రసికాగ్రేసరు లెవరూ వుండరని పసిగట్టడానికి ఆమెకి అట్టే రోజులు పట్టలేదు. ఇక్కడ హేమలతని గురించి కొంచెం చెప్పక తప్పదు.

హైద్రాబాద్‌లో ఓ ఇంజనీరు భార్య హేమలత. ఆమెకి పిల్లా జెల్లా లేరు. ఆమె భర్తది అదో తరహా! ఇల్లు తప్ప వేరే వ్యాపకాలేమీ లేవు అతనికి. భార్యతో సినిమాలు షికార్లు కొట్టాలన్న సరదా అతనికేమీ లేదు. ఉదయం పేపర్లు రెండు మూడు తెప్పించుకుంటాడు. అవి అన్నీ హెడ్డింగ్ దగ్గర్నించీ—లాస్టున పబ్లిష్ చేసేవారి

పేరు వరకూ అక్షరం వదలకుండా చదువుతాడు. వెంటనే భోజనం చేసి ఆఫీసుకు అరగంట ముందే చేరుకుంటాడు. సాయంత్రం వచ్చిన దగ్గర్నించి వేదాంత గ్రంథాలు పారాయణం ప్రారంభిస్తాడు ఈ విధమైన జీవితానికి అలవాటుపడిన భర్తగారితో విసుగెత్తిపోయింది హేమలతకి. అతనికి అన్నింటా వ్యతిరేకమైన అభిరుచులామెవి.

భర్తతో సినిమాలు, షికార్లు, వచ్చిన దగ్గర్నించి—మళ్ళీ వెళ్ళేదాకా భర్త తన కొంగు పట్టుకుని తిరగాలని — తనంత అందమైంది, తెలివైంది భార్యగా దొరికినందుకు తన అదృష్టానికి తనే పొంగిపోతూ తనని ప్రేమ కబుర్లతో-పొగడ్తలలో ముంచెత్తా లని హేమలత కోరిక.

ముసలాళ్ళే యీ రోజుల్లో కృష్ణా రామా అనుకోవడం లేదు. దర్జాగా సెకన్డ్ సినిమాలు చూసి వస్తుంటే మీరేమిటి ఎక్కడో బి. సి. నాటి మనిషిలా ప్రవర్తిస్తారు? ఆ వేదాంత పుస్తకా లేవిటి? ఆ ముక్కు మూసుకుని మూల కూర్చోవడం యేమిటి? అంటూ చాలా సార్లు విరుచుకుపడింది భర్తమీద.

భార్య యెన్ని సాధించినా హేమలత భర్త గోవిందరావు చెక్కుచెదరలేదు. ఈ చెవితో విని ఆ చెవితో వదిలేశాడు. ఇలాంటి రుసరుసలు, పోట్లాటలు అతనిలో ఆవగింజంత కూడా చలనం కలిగించలేదు.

ఇలాంటి జడపదార్థాన్ని తెచ్చి అంటగట్టిన తల్లిదండ్రులని ఏకధాటిగా తిట్టిపోసింది. కనబడని దేవుళ్ళ నందర్నీ ఏకిపెట్టింది. చివరకిలాంటి చాదస్తపు మగడికి సరైన గుణపాఠం చెప్పడమే మంచి దనుకుంది.

"నాకు యింట్లో యేం తోచడంలేదు. ఉద్యోగం చేస్తాను" అంది భర్తతో.

వెంటనే అంగీకరించాడు గోవిందరావు.

చివరకి ఆడపిల్లలని అందమైన మొగలిపూవులా ఆకర్షించే భూపాల్ దగ్గరే వుద్యోగం వచ్చింది.

వచ్చిన మర్నాటినించీ ఆమె యోగక్షేమాలు పాపం భూపాల్

శ్రద్ధగానే కనుక్కున్నాడు. ఆమె కథంతా రాబట్టుకుని "రైటో" అంటూ ఈలవేశాడు.

ఆమె భర్త కంటే తన ఘనత యెలాంటిదో చాటుకోవాలన్న రంధి పట్టుకున్న భూపాల్ ఆమె మనస్సెరిగినట్టు ప్రవర్తిస్తుంటే పరమానందభరితురాలైపోయింది. ఇంక ఆ చవటన్నర భర్తకి విడాకులు పారేసి భూపాల్‌ని కట్టుకుని ఆనంద వీచికల్లో తేలిపోవాలన్న తపన పట్టుకుంది. ఇంతలో భానుప్రభ కేసుపెట్టి రంగంలోకి దిగడంతో పాపం ఆమె కట్టుకున్న రమ్య హర్మ్యాలన్నీ ఒక్క దెబ్బతో కూలిపోయాయి. "ఛీ! ఏ మగవాడైనా అంతా అవకాశవాదులు" అనుకుంది పరితప్త హృదయంతో.

## 11

సరిగ్గా తొమ్మిది గంటలకి ఆ తోటలోని చిన్న బంగళా దగ్గరకు వచ్చింది సూర్యమిత్ర.

బాల్కనీలోంచే సూర్యమిత్రని గమనించిన భూపాల్ భీమ సింగ్‌ని కేకవేశాడు.

"అదుగో ఆ అమ్మాయి వస్తోందికాని పైకి పంపు. నువ్వు కూడా అటెన్షన్‌లో వున్నట్టు ఏ మాత్రం నా పిలుపు వినబడినా తపీమని వచ్చేయాలి" అంటూ మరోసారి హెచ్చరించి సోఫాలో కూర్చుని ఈవెనింగ్ ఎడిషన్ చూసుకోసాగాడు.

"వచ్చారా భీమసింగ్, మీ అయ్యగారు?" అంటూ ప్రశ్నించింది సూర్యమిత్ర.

"ఆ! వచ్చా రమ్మా! పైకి వెళ్ళండి...." అన్నాడు భీమ సింగ్.

సూర్యమిత్ర నిర్భయంగా పైకి వచ్చింది. అడుగుల సవ్వడి విని పేపరులోంచి తల ఎత్తాడు భూపాల్.

"గుడ్‌మార్నింగ్ బాస్!" అంది నవ్వుతూ సూర్యమిత్ర.

ఆ మాటకి ఒకింత ఆశ్చర్యపడినా "వెరీ గుడ్‌మార్నింగ్! ప్లీజ్ సిడౌన్" అన్నాడు ఎదురుగా కుర్చీ చూపించి.

"మెనీ థాంక్స్!" అంటూ కుర్చీలో కూర్చుంది సూర్య

మిత్ర.

"వూరక రారు పుణ్యాత్ములని మీలాంటివారు నాలాంటివాడి బంగళా వెతుక్కుంటూ రావడం విశేషమే!" అన్నాడు భూపాల్ తమాషాగా.

"ఏం చేస్తాం! ఒక్కోసారి తప్పదు. వసుదేవు డంతటివాడు గాడిద కాళ్ళు పట్టుకొన్నాడట—" అంది నవ్వుతూనే వ్యంగ్యంగా సూర్యమిత్ర.

ఆ మాటకి భూపాల్ ముఖం ఎర్రబడింది.

"పాపం! నువ్వేదో అనుకున్నావుగాని యిక్కడ గాడిద లెవరూ లేరు కాళ్ళు పట్టుకోవడానికి. అలాంటివా రెక్కడన్నా తారస పడతారేమో బయట వెతుక్కో" అంత కంటే వ్యంగ్యంగా జవా బిచ్చాడు.

"వెతుక్కోవలసిన అవసరం లేదులెండి. ఎక్కడ ఎలాంటి వారుంటారో నాకు తెలియకపోతేగా" అంటూ పరిహాసంగా నవ్వింది సూర్యమిత్ర.

భూపాల్ ముభావంగా పేపరు చూసుకోసాగాడు.

"ఆ ఈవినింగ్ ఎడిషన్ యెంతవరకు చూస్తారు లెండి" అంటూ పేపరు లాగి అవతల పడేసింది సూర్యమిత్ర.

భూపాల్ ఆమె చొరవకి కాస్త ఆశ్చర్యపడి ఆమెనే తదే కంగా చూడసాగాడు.

రెండు జడలు అల్లి సగానికి వదిలేసింది. నైలక్స్ చీర కట్టింది. ఆ ముస్తాబులో అతనికి పద్దెనిమిదేళ్ళ పిల్లలాగే కనిపిం చింది. ఒక్కక్షణం అతని మనస్సు అదోలా అనిపించినా యెదుట వున్నది ఆడరూపంలో వున్న తాచుపాము అని తట్టినవాడై తనలో సంచలనాన్ని తనే ఆపుకున్నాడు.

"ఇంతకీ భానుప్రభని—మీ అబ్బాయిని ఏం చేయదలచు కున్నారు?" అని అడిగింది తాపీగా!

ఆ మాట వింటూ ఉలిక్కిపడ్డాడు భూపాల్!

"భానుప్రభ విషయం నీ కెలా తెలుసు....?" అని

అడిగాడు.

"అదేం ప్రశ్న—వూరందరికీ తెలిపింది నాకు మాత్రం తెలియదా?"

భూపాల్ క్షణం మాట్లాడలేక పోయాడు. ఆ తర్వాత తేరుకొని—

"అయితే అది అడగడానికి వచ్చావా?" అని అడిగాడు.

"అవును. పాపం ఆడపిల్ల అన్యాయమవుతూంటే చూడలేక అడుగుదామని వచ్చాను."

"అబ్బ! ఏం జాలి! అయినా ఆ విషయాలేవో మేము చూసుకుంటాం. మధ్య నీకు దేనికి?"

ఆ మాటకి మహిషాసురమర్దినిలా లేచింది సూర్యమిత్ర.

"మిస్టర్ భూపాల్! ఏమిటి మీరూ మీరూ చూసుకునేది? అలా యెవరూ నీ విషయంలో జోక్యం పెట్టుకోకుండా వుండబట్టే నీకు హద్దూ పద్దూ లేకుండా పోతోంది. కాని ఒక్క విషయం గుర్తుంచుకో! నూరు గొడ్లని తిన్న రాబందు వొక్క గాలివానకే గోవిందా అంటుందట. ఆడదాని కన్నీటితో జలకాలాడాలనుకునే మగవాడెప్పుడూ బాగుపడలేదు. బాగుపడడు. యుగాలు మారినా రోజులు మారిపోయినాయనుకున్నా ఆడపిల్ల కన్నీటికి మాత్రం ఫలితం ఒకటే! నువ్వు చేసిన తప్పులకి లెంపలు వేసుకుని భానుప్రభని ఏలుకుంటావా? బ్రతికిపోతావు. లేదా! ఇలాగే మూర్ఖత్వం చూపించబోయావంటే మటుకు నీకు శృంగభంగం కాక తప్పదు—అటు కోర్టులోనూ చిత్తుగా ఓడిపోతావు. ఆ తర్వాత శ్రీకృష్ణ జన్మస్థానానికీ వెడతావు. ఒకవేళ తప్పుడు వేషాలు వేసి తిమ్మిని బమ్మి బమ్మిని తిమ్మి చేసి కోర్టులో గెలిస్తే నీకు ఆ క్షణంలోనే నూరేళ్ళు నిండుతాయి. అది గుర్తుంచుకో! నేను అది చెప్పడానికే వచ్చాను" అంది పెడీమని.

భూపాల్ మాట్లాడ లేదు గానీ, ఆమెనే పరీక్షగా చూడ సాగాడు.

ఇంక వెడతా నన్నట్టుగా బయలుదేరింది సూర్యమిత్ర.

ఏదో అనబోయేలోగా సూర్యమిత్ర విసురుగా క్రిందకి దిగి

వెళ్ళిపోయింది.

'ఏ ఆడపిల్ల మనస్తత్వం యెలాంటిదో తెలుసుకోకుండా పైలా పచ్చీసుగా డబ్బు, హోదా, అధికారం వున్న తనలాంటి యువకులు రొమాన్స్‌లోకి దిగడం అంత బుద్ధితక్కువ మరొకటిలేదు. ఎంతో మంది ఆడపిల్లలు తన జీవితంలో తారసపడ్డారు. ఆనందింప చేశారు. యెలా వచ్చారో అలాగే పోయారు. కాని ఈ రెండు మాత్రం కొరకరాని కొయ్యలు. చచ్చిందనుకున్న భానుప్రభ పిడిరాయిలా వుంది. ఏదో ఆడపిల్ల అని శృంగారం నెరపబోతే ఈ సూర్యమిత్ర దీని ముఖం తగలడ తనకి ఏకుమేకు కింద తయారై చస్తోంది. పైగా బోడి బెదిరింపులు కూడా. అది అసలు ఆడదేనా? కలియుగ రాక్షసి గాని" అనుకుంటూ పళ్ళు పటపటా కొరుక్కున్నాడు భూపాల్.

ఇంతలో పైకి వచ్చాడు భీమసింగ్ "ఆ పిల్ల వెళ్ళిపోయిందా సాబ్!" అని అడిగాడు.

"ఆ! పోయింది లే!" విసుగ్గా జవాబిచ్చాడు భూపాల్.

"ఏమంటుంది సాబ్?" అని అడిగాడు.

"ఏముందోయ్! నన్నేదో బెదిరిస్తోంది. తాటాకు చప్పుళ్ళకి కుందేళ్ళు బెదుర్తాయా? ఈసారి వస్తే యిక్కడే మాట్ చేసి పారేసి యీ తోటలోనే పాతిపెట్టిస్తాను" అన్నాడు క్రోధావేశాలతో వూగిపోతూ.

ఇంతలో ఫోన్ మోగింది. హైద్రబాద్‌నించి కాల్! తండ్రి మద్రాసు నించి హైద్రబాద్‌కి ఫోన్ చేశాడు. అది అతని అంతరంగిక ఉద్యోగి ఇక్కడికి వినిపించాడు.

"ఉత్తమచంద్ర మళ్ళీ పట్టుబడ్డాడు. అతనంతట అతనే వచ్చి" అదీ ఆ సందేశం—

అది వినగానే ఆశ్చర్యం వుప్పెనలా వచ్చింది.

"తప్పించుకు పారిపోయినవాడు తనంతట తనే వచ్చి పట్టుబడటం యేమిటి?...." అనుకొంటూ భీమసింగ్‌కి, అరిచినట్టే చెప్పాడు.

"నేనీ పూటే మద్రాసు వెడతాను భీమ్! ఇదేదో కొత్తగా

వుంది. వెళ్ళి చూడాలి" అన్నాడు హడావుడిగా లేస్తూ.

'ఏమిటో అయ్యగారి జీవితంలో క్షణక్షణానికి చిత్రాతి చిత్రమైన మార్పులు!' అనుకున్నాడు విడ్డూరంగా భీమసింగ్.

కారులో బయలుదేరిన భూపాల్ బుర్ర క్షణక్షణానికీ ఖాళీ అవుతూనే వుంది.

'ఇంటికంటె గుడి పదిలం అని బయటెక్కడా జరుగుబాటు కాక, యెవడూ ఉద్యోగం యివ్వక చివరికి దేవుడా అంటూ మళ్ళి జైలుకే తిరిగి వచ్చి వుంటాడు' అనుకున్నాడు చివరకి సంతుష్టి పడుతూ.

అతను మద్రాసు చేరేసరికి తండ్రి వరప్రసాద్ ఇతనికోసమే యెదురుచూస్తున్నాడు.

"ఏమిటి నాన్నా నిజమేనా?" అని అడిగాడు.

"ఆ! నిజమేరా! నేను స్వయంగా వెళ్ళి చూసి వచ్చాకే నీకు ఫోన్ చేసింది."

"ఎందుకు పోయినట్టు? యెందుకు వచ్చినట్టు?"అని అడిగాడు వెక్కిరింతగా!

"ఏమో వాడి బొంద" అన్నాడు వరప్రసాద్ సిగరెట్ ముట్టించి.

ఆ మర్నాడు తనే వెళ్ళి సెంట్రల్ జైల్లో ఉత్తమచంద్రని చూశాడు భూపాల్!

"పాపం! తెగించి వెళ్ళినవాడివి ఏ మారుమూలో పడివుండక పాపం మళ్ళీ నీ అంతట నువ్వే వచ్చావే?" అని అడిగాడు హేళనగా!

దానికి సమాధానంగా నవ్వి వూరుకున్నాడు ఉత్తమచంద్ర.

కాని అదంతా తుఫాను రాబోయే ముందు వుండే ప్రశాంతతని పాపం భూపాల్ గాని, వరప్రసాద్ గాని వూహించలేక పోయారు.

"ఇప్పుడేం చేద్దామంటావు నాన్నా....!" అని అడిగాడు తండ్రిని.

"ఏముందిరా మనం చేసేందుకు? ఆ పోలీసులే చూసు కొంటారు. కోర్టువారే చూసుకుంటారు" అన్నాడు తేలిగ్గా.

కానీ వారం గడిచేవరికి బ్రహ్మాండం బద్దలయింది.

యల్. ఐ. పి. (ఫైర్ ఇన్సూరన్స్) వారికి అనుకూలంగా తను సాక్ష్యం యిచ్చినందుకు తనమీద లేని కేసులన్నీ పెట్టి జైలుపాలు చేశారని—తనకి సరైన న్యాయ విచారణ జరపవలసిందిగా కోరుతూ జైలునించే ఉత్తమచంద్ర పెట్టిన అర్జీకి కోర్టువారు అంగీకరించి పంపిన సమను అందేసరికి యిటు భూపాల్—అటు వరప్రసాద్ యిద్దరూ భూమ్యాకాశాలేకమైనట్టు తలక్రిందులై పోయారు।

"ఇదేమిటి? ఏది చూపినా తమకి ఆలస్యంగానైనా ఇలా యెదురుతిరుగుతున్నాయి?" అనుకుంటూ అట్టే కూలబడిపోయారు. కాళ్ళూ చేతులూ చల్లబడిపోయి పాపం అరగంటవరకూ తేరుకోలేక పోయారు.

బోనులో వున్నా సింహం సింహమే; ఆ విషయం మరిచి పోయిన తండ్రీ కొడుకులు చాలాసేపు చిందులూ—శివాలూ తొక్కారు.

'ఉత్తమచంద్ర తిరిగి పట్టుబడ్డాడన్న వార్త పేపరులో చదివి చాలాసేపు యేడ్చింది సూర్యమిత్ర. ఆడపిల్ల మనస్సు యెంత కుసుమ పేశలమో తెలియని అతన్ని వలచిన తన జీవితంలో ఏనాటికైనా కాంతిరేఖలు ఉదయిస్తాయా? అతనాశపడినట్టు లాయరు కళ్యాణ చక్రవర్తి అతన్ని తగిన సాక్ష్యాధారాలతో అతని నిర్దోషిత్వం ఋజువుచేసి ఆ బందిఖానానించి విడిపిస్తాడా? కేవలం ఇదంతా తమ భ్రమేనా? అతను కనుక విడుదలకాకపోతే అన్యాయంగా శిక్ష అనుభ వించవలసి వస్తేనా అటు మద్రాసుని, ఇటు బెజవాడని, హైద్రా బాద్‌ని అన్నింటినీ పెట్రోలు పోసి అంటించి ఆ మంటల్లో అందరిళ్లు మండిపోతూ వుంటే—ఆ హాహాకారాల మధ్య తనుకూడా అందులో పడి చావడానికైనా వొప్పుకుంటుందిగాని, తనలో ప్రతీకార జ్వాల లను తీర్చుకోకుండా వుండదు' అనుకుంటూ ఆ పేపరు నేలకేసి కొట్టింది బలంగా।

భానుప్రభ అంతా చూస్తూనే వుంది. ఆమెకీ మనసులో కష్టం గానే వుంది. తను ఆశపడి అంత దూరంనించి పరుగెత్తుకు వచ్చినందుకు తనకి అనుకూలంగా యేదీ జరగలేదు. సరిగదా భూపాల్‌కి ఎదురు తిరిగి కేసులతో కోర్టుపాలయింది. గుట్టుగా వున్న బతుకు రట్టయింది. నిక్షేపంలాంటి వుద్యోగం వదులుకుని రావడం తనది ఎంత బుద్ధితక్కువో ఇప్పుడు తనకే అర్థమవుతోంది. ఇక్కడకు వచ్చి చెల్లెలి జీతం మీద ఆధారపడవలసి వచ్చింది. పైగా ఆమె ఉత్తమచంద్రని ప్రేమిస్తున్నట్టు తను ఆనాడే పసిగట్టింది. ప్రేమ విషయంలో తన అనుభవాన్ని పురస్కరించుకుని ఆ విషయం తను తేలిగ్గా చెప్పగలదు. అతను కాస్తా వెళ్ళి మళ్ళీ అరెస్టయ్యాడు. అందుకు చెల్లెలి మనస్సెంత క్షోభిల్లుతుందో తను తేలిగ్గా చెప్పగలదు. ఇన్ని అనర్థాలమధ్య తను ఏ ముఖంతో వుంటుందిక్కడ? కేసు విత్‌డ్రా చేసుకుని పిల్లాడితో తన మానాన తను వుండటమే. అజ్ఞాత వాసంలోకి వెళ్ళిపోవటమే మంచిది. ఆ తర్వాత సంగతి తన నుదుటన ఏం రాసివుంటుందో అదే జరుగుతుంది. అన్నివిధాలా అక్కడ్నించి వెళ్ళిపోవడమే ఎన్ని విధాల ఆలోచించినా ఉపయోగకరంగా తోచింది.

"సూర్యా! నేనింక వెళ్ళిపోతానే" అంది మెల్లగా.

"ఎక్కడికి?" అంది ఆశ్చర్యంగా సూర్యమిత్ర.

"ఎక్కడ్నించి వచ్చానో అక్కడికే!"

"మరి కేసు?"

"అది ఉపసంహరించుకుంటాను."

"ఇంత ఖర్చుపెట్టి, ఇంతదూరం వచ్చి ఉపసంహరించుకోవడం ఏమిటి!" విసుగ్గా అడిగింది సూర్య.

"ఎందుకు చెల్లీ! గెలుస్తామా పెడతామా? ఏదీ లేకపోగా అజ్ఞాతవాసం బయటపడింది. తిరిగి అరణ్యవాసం చేయాల్సిందేగా!" అంది విషాదంగా భానుప్రభ.

"చాల్లే నోరు మూసుకో. ఇంత కష్టపడుతున్నది ఏదో నీ సంసారం తిన్నబడి నువ్వూ, నీ కొడుకు సుఖంగా వుంటారనేగా!

గెలుస్తే గెలుస్తాం లేకపోతే లేదు. గెలవాలనే ఆశతోనే ఏ పనయినా ప్రారంభించేది. విధి వక్రించి ఓడిపోయాం అనుకో మనకేం తిండి లేకపోతేగదా కుళ్ళిపోవడానికి?" అంది సూర్యమిత్ర.

"ఏ వుద్యోగాలయినా నెలల తరబడి మానుకుంటే వుంటాయా?" ఎదురు ప్రశ్న వేసింది భాను.

"ఉండవు. కాని అక్కడపోతే ఇక్కడ చూసుకోవచ్చు. అందరం ఓ దగ్గరే పడివుండవచ్చు. ఒకవేళ అక్కా! నువ్వు కనుక కేసు ఓడిపోతే దిగులుపడి చావకు. నీ మొగుడు చచ్చినవాడుగా భావించి ఆ మాటమీదే ఉద్యోగం సంపాదించుకో! నీకు అక్కడా అక్కడా పని చేసిన అనుభవం వుంది. తేలిగ్గా ఎవరయినా ఉద్యోగము యిస్తారు" అంటూ ధైర్యం చెబుతున్న చెల్లెలి మనస్తత్వం అర్థం చేసుకోలేక, ఆమె హృదయంలో ఏముందో అంతకంటే అర్థంకాక ఓ దీర్ఘనిశ్వాసం విడిచి పిల్లాడి నెత్తుకుని అవతలకి వెళ్ళిపోయింది భానుప్రభ.

'భానుప్రభకి మనస్సు నొచ్చుకునేటట్టు తనేమన్నా ప్రవర్తించిందా?' అనుకుంటూ తనలో తనే తర్కించుకుంటూ అలాగే వుండిపోయింది సూర్యమిత్ర!

చివరకి అక్కయ్యకి కూడా భయం పట్టుకుంది గెలవనని. ఇలాంటి స్థితిలో తను ఇంకా ఎందుకా భూపాల్‌గాడిని అలా వదిలి వూరుకోవడం? అనుకుంటూ ఆ మర్నాడు తెల్లవారగానే టాయ్‌లెట్ అయి "అక్కా! నేనలా లాయరుగారింటికి వెళ్ళివస్తాను. కాస్త వంట చేసేయి" అంటూ బయలుదేరింది. అలాగే నన్నట్టు తల వూపడం తప్ప ఎందుకు వెడుతున్నావ్? అని అడగలేదు భాను. ఆమె వెళ్ళేసరికి కళ్యాణచక్రవర్తి ఇంట్లోనే వున్నాడు. అప్పుడే స్నానాదికాలు నిర్వర్తించుకుని సోఫాలో కూర్చుని కాఫీ త్రాగుతూ పేపరు చూస్తున్నాడు.

"రామ్మా?" అంటూ ఆప్యాయంగా ఆహ్వానించాడు సూర్య

మిత్రని. నమస్కారం చేసి ఎదురుగా కూర్చుంది సూర్య. మరో నిముషానికే మరో కప్పు కాఫీ వచ్చింది సూర్యమిత్ర కోసం.

అది ఆమె ముందు పెట్టి "తీసుకో" అన్నాడు కళ్యాణ చక్రవర్తి.

కాస్త బిడియంగానే అందుకుంది సూర్యమిత్ర. ఆమె కాఫీ త్రాగేదాకా వూరుకుని "ఏమిటి విశేషం ఇలా వచ్చావు?" అని అడిగాడు.

"ఏమీ లేదు. మా అక్కయ్య కేసు ఉపసంహరించు కుంటుందట."

"ఎందుకు? గెలుస్తామన్న నమ్మకం అప్పుడే పోయిం దేమిటి?" అన్నాడు నవ్వుతూ.

"ఏమిటో ఆమెకి సడన్‌గా అధైర్యం వచ్చేసింది."

"అలాంటివేం పెట్టుకోవద్దని చెప్పు. ఆమె తప్పకుండా గెలు స్తుంది" అన్నాడు కళ్యాణచక్రవర్తి ధైర్యం చెబుతూ.

ఆ మాటలకి తల వూపింది సూర్యమిత్ర. ఒక క్షణం ఆగి "ఉత్తమచంద్రగారు మళ్ళీ పోలీసులకి దొరికిపోయారు. చివరికి ఏమవుతారో అర్థంకావటం లేదు" అంది సూర్యమిత్ర.

"అతనికీ ఏం భయం లేదు. నువ్వనవసరంగా మనస్సులో దిగులుపడకు. మీ యిద్దరూ తప్పకుండా కలుస్తారు" అన్నాడు నవ్వుతూ.

"ఏమో! అంతా మీమీదే వదిలాను. చివరకి ఎవరం ఏమవు తామో మాకు తెలియదు" అని ఆగి "మీతో అంతరంగికంగా మరో విషయం చెప్పాలని వచ్చాను" అంది.

"చెప్పు. భయం దేనికి?"

"భయం కాదు. మీరు నన్ను అసహ్యించుకుంటారేమోనని."

"ఎలాంటివారయినా పరిస్థితులకు దాసులే. మరేం ఫర్వాలేదు చెప్పు."

"ఆ భూపాల్ నా మీద ఒకసారి అత్యాచారం చేశాడు" అంటూ ఆనాడు జరిగిందంతా వివరించింది సూర్యమిత్ర.

అది వినేసరికి చాలా కోపం వచ్చింది కళ్యాణచక్రవర్తికి.

"ఈ విషయం ఆనాడే తెలియజేస్తే ఒకటి రెండు కేసులతో తల మునిగి వుండేది అతగాడికి" అన్నాడు తమాయించుకుంటూ.

"ఇప్పటికి సమయం మించిపోయిందంటారా?"

క్షణం ఆలోచించి "నేరం అనేది ఎప్పటికయినా నేరమే। దాన్ని ఎవరూ కాదనలేరు" అంటూ "ఆల్‌రైట్ మిస్ సూర్యమిత్రా। నువ్వు కూడా అతనిపై ఓ కేసు బనాయించు" అన్నాడు లేచి నిలబడుతూ.

"ముందీ రెండూ తేలనీయండి. మూడోది కూడా దేనికి?"

"కాదు. ముందు లాయరు నోటీసిస్తాను. ఆ తర్వాత అతను సరయిన సమాధానం చెప్పకపోతే దీనికోసం కూడా కోర్టు చుట్టూ తిరుగుతాడు మిస్టర్ భూపాల్" అంటూ ఫక్కున నవ్వాడు కళ్యాణ చక్రవర్తి.

"మీరు మద్రాసు ఎప్పుడు వెనతారు?"

"ఈ రోజుకి ట్రైన్ రిజర్వేషన్ చేయించుకున్నాను ముందు. తర్వాత నా కారులో వెడదామని అది కాన్సిల్ చేసుకున్నాను."

"మీరు ఆయన ఎలా వున్నారో కాస్త చూసి రండి" అంటూ లేచి నమస్కరించి బయటకు వచ్చేసింది సూర్యమిత్ర.

# 12

తన కారు చిన్న రిపేరు రావడంతో గ్యారేజ్‌కి పంపిన కారు బాగయి తిరిగి రావడంతో ట్రైయిన్ ప్రయాణం కాన్సిల్ చేసుకున్న లాయరు కళ్యాణచక్రవర్తి ఆ రోజు కేసులకి వాయిదా కోరి పన్నెం డింటికల్లా భోజనాదికాలు నిర్వర్తించుకుని మద్రాసు బయలు దేరాడు. అతను తిన్నగా సెంట్రల్ జైల్లో వున్న ఉత్తమ చంద్రని కలుసుకుని ఫైర్ఇన్సూరెన్స్ కంపెనీ తాలూకు వివరాలన్నీ

అడిగి తెలుసుకున్నాకే హోటల్లో గది తీసుకున్నాడు. అక్కడ స్నానంచేసి భోజనంచేసి, హాయిగా పడుకున్నాడు.

ఆ రాత్రి ఓ ప్లాన్ వేసుకునే పడుకున్నాడు కనుక తెల్లారి లేచి చకచకా ఆ ప్లాను ప్రకారం ఎక్స్‌ప్లనేడ్‌లోని ఎల్. ఐ. సి. బిల్డింగుకు బయలుదేరాడు.

వరప్రసాద్ కంపెనీలోని ఫైర్ యాక్సిడెంట్‌ను గురించిన వివరాలు ప్రారంభించాడు. మేనేజర్ శ్రీనివాసన్ చాలా ఓపిగ్గా కళ్యాణచక్రవర్తి ప్రశ్నలకి జవాబివ్వసాగాడు.

"మీరు వరప్రసాద్‌గారి ఆఫీసులోని ఫైర్ యాక్సిడెంటుకు ఎంత చెల్లించారు?"

"లక్షన్నర."

"లక్షన్నరా. ఒక్క గదిలోనేటకదా యాక్సిడెంట్? దాంట్లో లక్షన్నర విలువచేసేవేం వున్నాయి?"

"ఆఫీసు ఫర్నిచర్ కాక ఐరన్ సేఫ్‌లోంచి తీసిన లక్ష రూపాయల రొక్కం, ఆఫీసు టేబుల్‌లో బ్యాంకిలో కట్టవలసిన సొమ్ము వుందని, అది పూర్తిగా తగలడిందని వారి అభియోగం. ముందు మేము సందేహించినా చివరకి నమ్మక తప్పలేదు."

"అయితే మీరు వాళ్ళకి పూర్తిగా డబ్బు చెల్లించేశారా?"

"ఆ! ఇదుగో వాటి తాలూకు ఫైల్స్" అంటూ చూపించాడు.

"మీరు బ్యాంకివారిని ఎంక్వయిరీ చేశారా? అసలు లక్ష రూపాయలే కారణంగా బ్యాంకిలో కట్టవలసి వచ్చిందో?"

"ఆ! ఓవర్‌డ్రాఫ్టు లక్ష రూపాయలు చెల్లించాలట. అందు వల్లే చివరకి వారి మాట నమ్మవలసి వచ్చింది."

"ఇంతకీ అది ఏం బ్యాంకి?"

"బాంక్ ఆఫ్ బరోడా."

"అయితే సరేలెండి. నేను మళ్ళీ ఓ గంటలో కనిపిస్తాను."

"మీరు ఏదన్నా పరిశోధనలు ప్రారంభిస్తున్నారా?"

"పరిశోధన కాదు. ఉత్తమచంద్ర అన్న అతను తనని అన్యాయంగా జైలుపాలు చేశారంటూ గోలపెడుతున్నాడు. అతని వాదన ప్రకారం ఆ గదిలో జరిగిన అగ్నిప్రమాదంవల్ల ఫర్నిచరు మాత్రమే నష్టమని, ఇంపార్టెంటు కాగితాలు-క్యాష్ అన్నీ వెనక గదిలో వుంటాయని. అందుకే నాకీ కేసు తీసుకోవాలనిపించి విజయవాడనించి ఇలా వచ్చాను" అంటూ ఉత్తమచంద్ర తనకి చెప్పిన విషయాలన్నీ వివరంగా చెప్పాడు కళ్యాణ్.

అవన్నీ శ్రద్ధగా విన్న శ్రీనివాస్ "అవును. అతను మొదట్నుంచీ అంటూనే వున్నాడు. జైలుపాలు అయ్యాడు. అతను చెప్పింది కూడా ఆలోచించదగిన విషయమే! అయితే ఏం చేద్దాం అంటారు?" అని అడిగాడు.

"నేను మళ్ళీ ఓ గంటలో వస్తాను. అప్పుడు మాట్లాడుకుందాం" అంటూ శ్రీనివాసన్ ఇచ్చిన కాఫీ త్రాగి లేచాడు కళ్యాణచక్రవర్తి.

అతని మెదడంతా ఆలోచనలతో నిండిపోయింది. బ్యాంకి వారికి లక్ష చెల్లించాలన్న వుద్దేశంతో అందులో డబ్బు పెట్టానంటున్నాడు వరప్రసాద్. అదీ నిజం కావచ్చు. కాని ఉత్తమచంద్ర మాటల్నిబట్టి అందులో సందేహించాల్సి వస్తోంది అనుకుంటూ కారు సెంట్రల్ జైలుకి పోనిచ్చాడు.

ఉత్తమచంద్రని పిలిపించారు.

"మిస్టర్ చంద్రా! మీ ఆఫీసులో అవసరం అయితే ఓవర్ డ్రాఫ్టు ఎక్కడ తీసుకుంటారు?" అని అడిగాడు కళ్యాణచక్రవర్తి.

"పంజాబ్ నేషనల్ బ్యాంక్."

"మరి బ్యాంక్ ఆఫ్ బరోడాలో ఆఫీసు ఎక్కౌంట్ ఏమన్నా వుందా?"

"వుంది. జీతాలు యివ్వవలసిన రోజున అక్కడినించే తెప్పిస్తారు."

"అయితే మీ వరప్రసాద్ లక్ష రూపాయలు బ్యాంక్ ఆఫ్ బరోడాలో కట్టాలన్నాడట దేనికి?"

"ఎప్పుడు?"

"అదే అగ్నిప్రమాదం సంభవించే రోజు లక్ష రూపాయలు ఐరన్‌సేఫ్‌నుంచి తీసారట. అది మీ వరప్రసాద్ కూర్చునే చైర్ ముందున్న సన్‌గ్లాస్ టేబుల్ సొరుగులో పెట్టారని దానితోపాటు ఆ డబ్బంతా కాలిపోయిందన్న వరప్రసాద్ మాట నిజమా పట్టిదా?"

"పట్టిదే. ఆ రోజు అసలు ఐరన్‌సేఫ్‌లోంచి డబ్బే తీయ లేదు."

"మరి బ్యాంకివారు వరప్రసాద్ డబ్బు కట్టాలనే చెప్పారట."

ఒక్క నిముషం ఆలోచించి ఉత్తమచంద్ర "మా ఆఫీసుకు ఓ బ్రాంచి వుంది. దాని కోసం అక్కడ కరెంట్ ఎక్కౌంట్ రన్ చేస్తూ అక్కడ ఓవర్ డ్రాఫ్టు తీసుకున్నాడేమో!"

"మీ బ్రాంచి ఎక్కడుంది?"

"మా ఆఫీసుకు కాస్త దూరంలోనే."

"అడ్రసు తెలుస్తే రాయి."

కాగితంమీద రాసిచ్చి "ఈ ఆఫీసు విషయం చిన్న క్లర్కుల కెవరికీ అంతగా తెలియదనే నా వుద్దేశం. అంటే అగ్నిప్రమాదం సంభవించిన ఓ రెండు నెలల క్రిందటే అది తెరిచారు."

"అది ఎవరి పేరులో వుంది?"

"వరప్రసాద్ అండ్ సన్ కంపెనీ అని పెట్టారు. దాంట్లో, ఇంపోర్ట్స్ అండ్ ఎక్స్‌పోర్ట్స్ కంపెనీ నడుపుతామని మొదట. ఆ తర్వాత దాన్ని 'లారీ సర్వీస్'గా మార్చారని అన్నారు. నాకంత కంటే వివరాలు తెలియవు" అన్నాడు ఉత్తమచంద్ర.

"చాలు. ఈ వివరాలు చాలు. మిగిలినవన్నీ నేను చూసు కుంటాను. రేపు మీ సూర్యమిత్ర అక్కగారికి కేసు వాయిదా వుంది. నేనీరాత్రికే వెళ్ళిపోతాను. అక్కడ పనులు చూసుకుని రెండు రోజుల్లో మళ్ళీ వస్తాను" అన్నాడు కళ్యాణ్.

అలాగే నన్నట్టు తల పంకించాడు ఉత్తమచంద్ర.

కళ్యాణచక్రవర్తి తిన్నగా కారులో మళ్ళీ ఎల్. ఐ. సి. బిల్డింగ్ దగ్గరకి వచ్చాడు. శ్రీనివాస్‌ని కలుసుకుని వివరాలన్నీ చెప్పి "మీరు కూడా తిరిగి ఎంక్వయిరీ ప్రారంభించండి" అని హెచ్చరించి బయలుదేరాడు.

అతని మనస్సంతా రకరకాల ఆలోచనలతో బరువెక్కి పోయింది. ఈ కేసులన్నీ గెలిస్తే నిజంగా తను ఘనవిజయం సాధించినట్టే అనుకుంటూ తిరిగి వచ్చాడు. ఇంటికి వచ్చేసరికి అతని భార్య పద్మప్రియ గుమ్మంలోనే నిలబడి వుంది.

"ఏం పద్మా ఇక్కడున్నావు?" అని అడిగాడు కారు లోపల పెడుతూ.

"ఏమీలేదు. సూర్యమిత్ర ఇప్పుడే వచ్చి వెళ్ళింది" అంటూ అతనిచ్చిన కోటు అందుకుంది.

"ఆ అమ్మాయి పనిమీదేగా వెళ్ళింది" అన్నాడు సోఫాలో కూర్చుంటూ.

"అందుకేగా ఆమె అంత ఆదుర్దాగా పరుగెత్తుకుంటూ వచ్చింది" అంటూ లోపలకి వెళ్ళింది కాఫీ తీసుకురావడానికి.

ఆ కాఫీ త్రాగి కాస్త స్థిమితపడ్డాడు చక్రవర్తి.

వాయిదా రోజున భానుప్రభతోపాటు సూర్యమిత్ర కూడా కోర్టుకు వచ్చింది. విచారణ తిరిగి ప్రారంభమయింది.

"ఇంతకీ మీరీమె నేమీ చేయలేదని, ఆ బిడ్డ మీ బిడ్డ కాదని అంటారు. అంతేనా?"

అవునన్నట్టు తలూపాడు భూపాల్.

"మీరేమంటారమ్మా?" అంటూ అడిగాడు భానుప్రభని.

"అబద్ధాలాడినా అది అతికినట్లుండాలి. ఆయనా బిడ్డని తన బిడ్డగా అంగీకరిస్తే చాలు ఆయన ఆస్తిలో మాకు వాటాలవసరం లేదని ముందే మనవి చేశాను. కాని ఆయన ఇప్పటికీ అదే మాట మాట్లాడుతున్నారు. నా బిడ్డకి తండ్రెవరో లోకానికి తెలియాలి.

అందుకోసం నా ప్రాణం వున్నంతవరకూ ప్రయత్నిస్తూనే వుంటాను. ఒకనాడు దుష్యంతుడు గాంధర్వ వివాహంతో శకుంతలని పొంది భరతుడిని కన్నా నిండు సభలో భార్యా, బిడ్డని గుర్తించలేకపోతే మహర్షి శాపం అని సరిపెట్టుకున్నది. ఆమె పూజలు ఫలించి అతనికి గతం గుర్తు వచ్చి భరతుడిని ఆప్యాయంగా అక్కున చేర్చుకుని పట్టాభిషిక్తుని చేసిన దుష్యంతుడంతటి మహారాజు-నీతికోవిదుడు నా భర్త కాడు కనుక అది పురాణకాలం, ఈ కాలం కాదు కనుక అతనికి అన్నీ గుర్తు చేయాలి. నాలాంటి ఆధునిక శకుంతలలకి ఆధునిక సౌకర్యాలు లేకపోతే అపహాస్యంపాలు కాక తప్పదు" అంటూ ఆనాడామె దొంగలించిన టేప్‌రికార్డర్ తీసి కళ్యాణ్ కివ్వగా అది పబ్లిక్ ప్రాసిక్యూటర్‌కి అందించి "ఆన్‌చేసి వినండి" అన్నాడు కళ్యాణ చక్రవర్తి.

అది చూసేసరికి బుర్ర గిరగిరా తిరిగింది భూపాల్‌కి.

కోర్టు హాలంతా నిశ్శబ్దంగా అయిపోయింది. ఆన్‌చేసిన టేపు రికార్డర్‌లోంచి అన్ని మాటలూ స్పష్టంగా వినిపిస్తుంటే ముచ్చెమటలతో తడిసి ముద్దయ్యాడు భూపాల్.

"స్టాప్! స్టాపిట్" అంటూ గట్టిగా అరిచాడు.

ఆగిపోయింది టేప్‌రికార్డరు.

"ఇదంతా నిజమేనా?" అని అడిగిన కోర్టువారి ప్రశ్నలకు తల పిదిలించాడు భూపాల్.

"నిజమే! అంతా నిజమే! ఆమె తెలివి, అందం నన్ను ఉన్మత్తుడిని చేసింది. అందుకే ఆమెని పొందాలనుకుంటే పెళ్ళి చేసుకుంటేగాని లొంగేలా కనిపించకపోతే ఉంగరం తొడిగాను. ఆమెని పొందాను. ఆ బిడ్డ నా వాడే!" అంటూ ఏదో హిప్నాటిజమ్ జరిగిన వాడిలా గడగడా చెప్పేశాడు భూపాల్.

భానుప్రభ కళ్ళల్లో కోటిసూర్యుల కాంతి తేజరిల్లింది. ముఖం ఆనందంతో కళకళలాడిపోయింది.

"సో! భూపాల్‌గారు ఆమెని తను పొందిన విషయం— బిడ్డ విషయం నిజమేనని అంగీకరించారు కనుక-అతనింతవరకూ అవివాహితునిగానే వున్నారు కనుక భానుప్రభని ఏలుకోవడం-తన బిడ్డని స్వీకరించడం జరగాలని కోరుతున్నాను" అంటూ చెప్పి కూర్చున్నాడు కళ్యాణచక్రవర్తి.

దానిమీద జడ్జీకూడా భానుప్రభకి అనుకూలంగానే జవాబు చెప్పాడు.

భానుప్రభ అతని భార్య. ఆ బిడ్డ తన కొడుకు. వారిని ఏలుకోవడం మంచిది. కానిపక్షంలో పిల్లాడిపోషణకు-తల్లికి లక్షరూపాయలు యివ్వవలసివుంటాడు. భూపాల్ ఆ తీర్పుని విన్నాడు. ఆలోచనలోపడ్డాడు.

లక్షరూపాయలు మనోవర్తి కింద పారేస్తే సరిపోతుంది. తనని కోర్టుకీడ్చి అల్లరిపాలు చేశాక తన పరువుప్రతిష్ఠల్ని మంట గలిపాక ఈవిడగారిని మహారాణిని చేసి ఎవడు ఏలుకుంటాడు?

"నేను లక్షరూపాయలు రేపు కోర్టువారి సముఖానికి పంపిస్తాను. నా కామెని ఏలుకోవడం కుదరదు-నా యిష్టం వచ్చిన పిల్లని నేను ఎప్పుడో పెళ్ళిమీద మనసు పుట్టినప్పుడు చేసుకుంటాను. ఆ డబ్బు మీరు లాయరుగారి ద్వారా ఆవిడగారికి అందచేయండి" అంటూ దిగిపోయాడు భూపాల్.

ఆ మాట భానుప్రభ వింది. సూర్యమిత్ర విన్నది. 'తను గెలిచింది. నిజమే! అతని దగ్గర్నించి భరణం తీసుకోగలిగిందేగాని ఆతని హృదయం తీసుకోగలిగిందా?" అనుకుంటూ నిట్టూర్చింది.

ఆ మర్నాడే లక్షరూపాయల చెక్కు- లాయరు కళ్యాణ చక్రవర్తి ఆమెకి అందించి మద్రాసు బయలుదేరాడు.

భూపాల్ మద్రాసు చేరుకున్నాడు, ఉత్తమచంద్ర పెట్టిన కేసు కోసం.

కళ్యాణ్ వెడుతూంటే సూర్యమిత్ర వచ్చింది ఆయన దగ్గరకి.

"మా అక్కయ్యని ఏలుకోవడానికి ఇష్టపడలేదు భూపాల్. ఆమె సమస్య పరిష్కారమయిపోయింది. మరి ఉత్తమచంద్రగారు కేసు గెలుస్తారో-లేదో చెప్పలేను. నా మనస్సు యింకా కుతకుతా వుడుకుతూనే వుంది లాయరుగారు. నేనయినా అతన్ని జైలుపాలు చేయించందే మనస్సు శాంతించదు. ఆ రోజు భూపాల్ నా పట్ల ప్రవర్తించిన అమానుష వైఖరికి అతనికి లాయరైన మీ ద్వారా నోటీసు పంపిస్తాను" అంది ఆవేశంగా సూర్యమిత్ర.

ఆ మాటకి నవ్వాడు కళ్యాణచక్రవర్తి.

"నీ విషయం కోర్టు కీడవాలనిలేదు. అతన్నించి సంజాయిషీ రాబట్టి ఆ తర్వాత ఆలోచించవచ్చు. పెళ్ళికావలసిన పిల్లవి. ముందే కోర్టులపాలైతే ఎంత ధైర్యంగల మగాడికైనా నిన్ను పెళ్ళాడే దమ్ముండదు. ఈ విషయాలు ఉత్తమచంద్రలో రియాక్షన్ కలిగించాయంటే నీ భవిష్యత్తంతా దెబ్బతింటుంది" అన్నాడు కళ్యాణ్.

"అయితే ఏం చేయను?" నిస్సహాయంగా అడిగింది.

"నేను నీ తరపున నోటీసు పంపిస్తాలే" అంటూ మద్రాసు బయలుదేరాడు కళ్యాణచక్రవర్తి.

"నేనింక ఢిల్లీ వెళ్ళిపోతాను" అంది భానుప్రభ.

"ఎందుకక్కా! ఇక్కడే ఏదో బ్యాంకులో ట్రై చెయ్యి."

"అవసరంలేదు సూర్యా? ఢిల్లీ వెళ్ళి అక్కడ మాట్లాడుకుని ఈ బ్రాంచీలో పని చేసేలా వేయమని అడుగుతాను" అంది భానుప్రభ.

"సరే! పోనీ ఆ పని అన్నా చేయి. ఎక్కడో దూరంగా విసిరేసినట్టు పిల్లాడిని పెట్టుకుని అక్కడ వుండటం దేనికి?" అంది సూర్యమిత్ర.

ఆ రోజే ఢిల్లీ ప్రయాణానికి అన్ని ఏర్పాట్లూ చూసుకోసాగింది భానుప్రభ. కాని ఆమె హృదయంలో అగ్నిపర్వతాలే బ్రద్దలవుతున్నాయి. తన భూపాల్ తన ప్రేమని కాస్తంతైనా గుర్తించ గలి

గితే ఎంత బాగుండేది? తామిద్దరి అనుబంధానికి డబ్బు విలువకట్టి తెగ్రతెంపులు చేసుకున్నాడు. అతనికి నిజంగా తనంటే మమకారం లేదు. ఉంటే వదిలేవాడు కాదు. మమతలులేని మనిషిని చావగొట్టి ప్రేమించమనడానికి యెవరికి అధికారం వుంది. ఆ స్పందన అతని హృదయానికి కలగాలి. ఆ ప్రేమఘంట అతనిలో ప్రణవనాదంలా మ్రోగాలి. అప్పుడే హృదయం తీయని అనుభూతులకు లోనై అనురాగంలోని మాధుర్యాన్ని అర్థం చేసుకుంటాడు. తన దురదృష్టం కొద్దీ అతన్ని కదిలించలేకపోయింది. పోనీ మరే స్త్రీ అయినా అతనిలో తీవ్రసంచలనాన్ని కలిగించి ఆ అనుభూతుల్ని అనుభవించేట్టు చేస్తే బాగుండు. ఎప్పటికైనా అతని స్మృతిపథంలో తను లీలామాత్రంగానైనా మెదిలినప్పుడు ఆ నాడిలాగే భాను తనని హృదయం అర్పించి ఆరాటపడింది కదాని కాస్తయినా అర్థం అవుతుంది అనుకుంటూ బొటబొటా కన్నీరు కార్చింది.

తన బాధలో తను వుంది సూర్యమిత్ర. ఆమె మనస్సంతా ఉత్తమచంద్ర గెలవాలని జైలునించి విడుదల అయి వచ్చి తన మెడలో మూడుముళ్ళూ వెయ్యాలన్న ఆరాటమే ఆమెకి సరిపోతోంది గాని అక్క హృదయావేదన అర్థం చేసుకునేస్థితిలోలేదు. అదికూడా గమనించింది భాను.

లోకంలో అందరు ఆడపిల్లలూ ఇలాగే గుండె బ్రద్దలు చేసుకుంటున్నారా? ప్రత్యేకించి తామిద్దంనే ఇలా సృష్టించాడా? అనుకుంది ఏడుస్తూ.

## 13

ఆ రోజే కేసు ప్రారంభమయింది. వరప్రసాద్ ముఖంలో గాని, భూపాల్ ముఖంలోగాని కత్తివేటుకు నెత్తురుచుక్క లేదు.

లాయర్ కళ్యాణచక్రవర్తి యిచ్చిన వివరాలతో ఫైర్ ఇన్సూరెన్స్ కంపెనీవారు తిరిగి పరిశీలన ప్రారంభించగా తమదగ్గర అదనంగా డబ్బు చాలా వసూలు చేసినట్టు అనుమానం ధృవపడి

వారుకూడా కోర్టులో కేసు దాఖలు చెయడంతో వరప్రసాద్, భూపాల్‌ల తల తిరిగిపోయింది. చివరికి గెలిచాం అనుకుని విర్ర వీగినవన్నీ చివరకీనాడు ఎదురుతిరగడంతో గజగజా వణికిపోయారు. భానుప్రభ కోర్టులో గెలవడం భూపాల్‌కి ఒక పెద్ద గొడ్డలిపెట్టేగాదు ఇంతకాలం అతనిలో పేరుకుపోయిన మొండితనం, దిలాసా అన్నీ కాస్త కాస్తే కరిగించేసింది. ఇప్పుడతనికి ఏది చూపినా భయమే! ఎక్కడ చూపినా అధైర్యమే! ఏ కేసులో ఎలా ఓడిపోతానో అన్న పిరికితనం బాగా పట్టుకున్నాయి.

ఉత్తమచంద్రలో అంతవరకూ అరికట్టుకుంటూ వచ్చిన పెను తుఫాను ఒక్కసారే విరుచుకుపడిపోయింది. ప్రశాంతంగా వుంది ఆ వెధవ పట్టుపడినప్పుడు అని సంతోషించినందుకుగాను అంతకంతా యిప్పుడు ఏడుస్తూ బోను యెక్కాను అనుకున్నాడు వరప్రసాద్.

బోనులో నిలబడ్డాడు వరప్రసాద్.

"మీరు ఫైర్ ఇన్సూరెన్స్ కంపెనీవారికి తప్పుడు లెక్కలు చెప్పి లక్షరూపాయలు అదనంగా ఫైర్ యాక్సిడెంట్‌లో జరిగిన నష్టానికి వసూలు చేశారన్న అభియోగానికి ఏమని జవాబు చెబుతారు?" అని ప్రశ్నించాడు పబ్లిక్ ప్రాసిక్యూటర్.

"మేమేమీ తప్పుడు లెక్క చెప్పలేదు. ఫర్నిచర్ యాభై వేలది. పొరపాటున బ్యాంకివారికి చెల్లించవలసిన లక్షరూపాయలూ అందులో టేబుల్ సొరుగులో పెట్టాము. పెట్టిన పదినిముషాలకే యాక్సిడెంట్ అయింది" అన్నాడు వరప్రసాద్.

"అసలు యాక్సిడెంట్ ఎలా అయింది?"

"కరెంట్ సర్క్యూట్‌వల్ల."

"ఎన్ని గదులు నష్టపోయాయి?"

"ఆఫీసులోవున్న ఆరుగదుల్లోనూ అయిదుగదులు ప్రమాదానికి గురి అయ్యాయి."

పాయింట్ నోట్ చేసుకున్నారు.

ఉత్తమచంద్ర బోనులో నిలబడ్డాడు.

"మీ పేరు?"

"ఉత్తమచంద్ర."

"మీరా ఆఫీసులో ఎంత కాలంనించీ పని చేస్తున్నారు?"

"షుమారు ఆరు సంవత్సరాల నించీ."

"అగ్ని ప్రమాదం జరిగిన రోజున ఎక్కడున్నారు?"

"అప్పటికి ఆఫీసు టైము ముగింపుకు వచ్చింది. అర్జెంట్ వర్కు చూస్తూ నా గదిలో వున్నాను."

"మీ ఆఫీసు యెన్నింటికి తెరుస్తారు? ఎన్నింటికి మూస్తారు?"

"ఉదయం పదినించి సాయంత్రం అయిదున్నర వరకు."

"ప్రమాదం ఎన్నింటికి సంభవించింది? ఎలా?"

"సరిగ్గా అయిదుగంటల అయిదునిముషాలకి. కరెంట్ తీగలు తెగి టేబుల్‌మీద, కుర్చీలమీద పడి ఒక్కసారే మంటలేచింది. మంట మంట అనగానే నేను మిగతా గదులకి సోకకుండా తగిన జాగ్రత్తలు తీసుకున్నాను-వెంటనే ఫైర్‌స్టేషన్‌కి ఫోన్‌చేశారు వరప్రసాద్‌గారు."

"వరప్రసాద్ అయిదుగదులకి సోకింది ప్రమాదం అంటున్నారు."

"లేదు. జరిగింది ఒక గదికే. కాని టాక్ మాత్రం అలా వచ్చింది."

"ఆ విషయం మీరు గట్టిగా చెప్పగలరా?"

"ఓ.యస్. నేనిలా అన్నాననే ఆ రోజు నించీ కక్షపూని జైలుపాలు చేసింది." అంటూ తీవ్రంగా చూశాడు ఉత్తమచంద్ర వరప్రసాద్‌కేసి.

వరప్రసాద్ పళ్ళు పటపట కొరికాడు. అది స్పష్టంగా చూశాడు లాయర్ చక్రవర్తి.

భూపాల్ కళ్ళల్లోనూ విస్ఫులింగాలు కురిశాయి.

ఫైర్ ఇన్స్యూరెన్స్ తరపున అసిస్టెంట్ మేనేజర్ బోనులో విలబడ్డాడు.

"మీరు వరప్రసాద్ కంపెనీకి ఫైర్ యాక్సిడెంట్ జరిగిందని తెలుసుకున్నప్పుడు చూడటానికి వెళ్ళారా?"

"వెళ్ళాను. మాకు మర్నాడు ఉదయం శ్రీ వరప్రసాద్ నించి ఫోన్ కాల్ వచ్చింది అప్పుడు వెళ్ళాను."

"అంటే సుమారున పైమెంత అవుతుంది?"

"పదింటికి ఆఫీసుకి వచ్చాను. వచ్చిన అయిదునిముషాలకి ఫోన్ మ్రోగింది. ఈ వార్త అందుకోగానే నేను, మా డిపార్ట్ మెంట్‌లో పనిచేసే శ్రీ కృష్ణప్పను తీసుకువెళ్ళాను. ఫర్నిచర్ కాలిపోయిన భాగాలు అయిదుగదుల్లోనూ కనిపించాయి. కొన్ని పూర్తిగా కాలిపోయాయన్నారు వరప్రసాద్‌గారు."

వరప్రసాద్‌ని ప్రశ్నించాడు ప్రాసిక్యూటర్.

"క్రితంరోజు సాయంత్రం అయిదుగంటల అయిదునిముషాలకి ఫైర్ యాక్సిడెంట్ అయితే మర్నాడు ఉదయం పదిగంటలకి ఫోన్‌చేయడం ఏమిటి?"

"ఇక్కడ ఫైరింజన్‌వారు వచ్చి ఆర్పి అన్నీ రాసుకుని వ్యవహారాలు చూసుకునేసరికే ఆరయింది. అప్పుడు యల్.ఐ.సి. ఆఫీసు కూడా వుండదు. మూసేస్తారు గనక ఫోన్ చేయలేదు."

వెంటనే కళ్యాణచక్రవర్తి లేచినిలబడి

"యువర్ ఆనర్! మీరిక్కడ ఓ విషయం ఆలోచించాలి. బ్యాంకికి లక్షరూపాయలు పంపాలి. అది డ్రాయరు సొరుగుతోపాటు కాలిపోయిందన్న వరప్రసాద్ మాట అంత సహేతుకంగా లేదు. ప్రమాదం జరిగింది సాయంత్రం అయిదుగంటల అయిదునిముషాలకి. బ్యాంక్ టైము యెంతవరకో-అది దాటితే డబ్బు యెలా కట్టించుకుంటారో ఒక్కక్షణం కోర్టువారు ఆలోచించాలి."

పాయింట్ నోట్ చేసుకున్నారు.

"ఫైర్ ఇన్సూరెన్స్ కంపెనీ అయిదు దాటితే మూసేస్తారని తెలిపిన వరప్రసాద్‌కి బ్యాంక్ మూసేస్తుంటే డబ్బు కట్టించుకోరని

తెలియదా! ఆయన ఓవర్‌డ్రాఫ్టులెప్పుడూ అయిదు దాటాక ఏ బ్యాంకీల్లో కడుతున్నారో వివరంగా చెప్పమనండి" అంటూ కూర్చు న్నాడు లాయర్ చక్రవర్తి.

ఆ మాటకి ఆగ్రహం వచ్చినా జవాబు తన దగ్గర రడీగా లేనందున దిక్కులు చూడసాగాడు వరప్రసాద్.

విచారణ అయిదురోజులు సాగింది. చివరకు సాక్షులనందర్నీ విచారణ జరిపాక వరప్రసాద్, భూపాల్‌లు ఫైర్ ఇన్సూరెన్స్ కంపెనీనుంచి అనవసరంగా లక్ష వసూలు చేసారని తేలింది.

ఆ రోజే తీర్పు చెబుతారు. ఆ రోజుకు భానుప్రభని తీసుకుని సూర్యమిత్ర కూడా కోర్టుకు హాజరయింది. కోర్టులో పక్కపక్కనే కూర్చున్న భానుప్రభని, సూర్యమిత్రతి చూపి అదిరిపడ్డాడు భూపాల్.

అతనికా క్షణంలో ఆ యిద్దరు ఒకరు అగ్ని, ఒకరు వాయువులా కనిపించసాగారు. ఆ యిద్దరూ కలిపి తనని నిలువునా దహించి కాని వదలరనిపించి కంపించిపోయాడు. అదే క్షణంలో ఆ ఇద్దర్నీ చూపిన ఉత్తమచంద్ర ముఖం శరత్కాలపు జాబిల్లిలా దగద్ధగాయమానంగా వెలిగిపోయింది. అతని చిరునవ్వుల వెన్నెల సుతారంగా తాకింది సూర్యమిత్రని.

ప్రాసిక్యూటర్ కేసు వివరాలన్నీ పూర్తిగా వినిపించసాగాడు.

మే పదహారవ తేదీ సాయంత్రం అయిదుగంటల అయిదు నిముషాలకు వరప్రసాద్ కంపెనీలో కరెంట్ తీగలు తెగి టేబుల్స్ వగైరా ఫర్నిచరు మీద అగ్నిప్రమాదం సంభవించింది. ఆ డ్రాయరు సొరుగులో బ్యాంక్‌లో కట్టవలసిన లక్షరూపాయలున్నాయని వాదించిన వరప్రసాద్‌ది పూర్తిగా అబద్ధమని కేవలం ఇన్సూరెన్స్ కంపెనీని మోసగించి డబ్బు లాగడమే ధ్యేయంగా పెట్టుకున్నాడని ఈ క్రింది కారణాలవల్ల ఋజువవుతోంది. వరప్రసాద్ కంపెనీకి యెప్పుడూ ఓవర్ డ్రాఫ్టులిచ్చేది పంజాబ్ నేషనల్ బ్యాంక్. వరప్రసాద్ అండ్ సన్ పేరుతో ఫిబ్రవరి ఇరవై ఐదున ఓ కొత్త కంపెనీ ఓపెన్ చేసి

దాని తాలూకు ఎకౌంట్లన్నీ బ్యాంక్ ఆఫ్ బరోడాలో ఏర్పాటు చేసుకున్నాడు.

వరప్రసాద్ అండ్ సన్ పేరుతో మొదట జీడిపప్పు, లవంగాలు మొదలైన సరుకులు విదేశాలకి పంపాలని ఇంపోర్ట్స్ అండ్ ఎక్స్‌పోర్ట్స్ కంపెనీ ప్రారంభించినా అది ఎందువల్లో లాభసాటి అనిపించకపోవడంవల్లే కావచ్చు లారీ సర్వీస్ (తమిళనాడు, ఆంధ్రప్రదేశ్‌లమధ్య) ప్రారంభించాడు. లారీల నిమిత్తం లక్షరూపాయలు బ్యాంక్ ఆఫ్ బరోడాలో ఓవర్‌డ్రాఫ్టు చేసిన మాట వాస్తవమే; దాని ఆఖరురోజు అగ్నిప్రమాదం సంభవించిన మర్నాడే; ఫైర్ ఇన్సూరెన్స్‌వారు "వరప్రసాద్‌గారు మీకు లక్షరూపాయలు బ్యాంక్‌లో కట్టాలా" అని బ్యాంకువార్ని ఎంక్వయిరీ చేసినప్పుడు కట్టవలసిన మాట వాస్తవమే కనుక నిజమేనన్నారు. దాంతో ఇన్సూరెన్స్‌వారు కూడా నిజమే అయివుంటుందని పైగా ఎన్ని విధాల ఎందర్ని ఎంక్వయిరీ చేసినా అదే మాట వినిపించడంతో లక్షా యాభై వేల రూపాయలు చెల్లించారు ఇన్సూరెన్స్‌వారు.

ఈ కేసులో అన్ని విషయాలూ తెలిసినవాడు మిస్టర్ ఉత్తమచంద్ర ఒక్కడే; అతను మొదట్నించీ ప్రమాదం సంభవించింది ఒక్క గదికి మాత్రమేనని—అసలు లక్షరూపాయలు అందులో పెట్టనేలేదని మొదట్నుంచీ చెబుతూ వచ్చాడు. అతనితోపాటు మరో వ్యక్తికూడా అదే మాట అన్నాడు. కాని యీ యిద్దరూ ఆ తర్వాత కనిపించలేదు. అదేమంటే వరప్రసాద్ మీద హత్యాప్రయత్నం చేశాడని పదివేలు తస్కరించాడని ఉత్తమచంద్రమీద నేరం ఆరోపించి జైల్లో పెట్టారు.

ఆ పదివేలు యెక్కడా కనిపించలేదు పోలీసువారికి. అతనికి భార్యా బిడ్డలుకూడా లేరు. ఎక్కడ దాచాడో యెంత తల బద్దలు కొట్టుకున్నా యెవరికీ ఆనాడు అర్థం కాకపోయినా, ఈ నాటకమంతా వట్టిదేనని ఋజువవుతోంది—ఇన్సూరెన్సు కంపెనీని మోసగించడానికి

ప్రయత్నించిన తండ్రి వరప్రసాద్‌ని అతని కొడుకు భూపాల్‌ని తగిన విధంగా శిక్షించవలసిందిగా కోరుకున్నాను."

కళ్యాణచక్రవర్తి ముఖంలో ఆనందం తొణికిసలాడుతోంది. సూర్యమిత్ర కళ్ళనుంచి ఆనందబాష్పాలు రాలుతున్నాయి. కాని భాను ప్రభ ముఖం మాత్రం నల్లని మబ్బులు కమ్మిన చంద్రబింబంలా వుంది. ఏం శిక్ష విధిస్తారో అని ఆమె హృదయం దడదడ లాడు తోంది.

"గవర్నమెంటును—బ్యాంకీలని—ఫైర్ ఇన్సూరెన్స్‌వారిని అందర్నీ మోసపుచ్చబోయిన వరప్రసాద్‌కి నాలుగేళ్ళ జైలుశిక్ష. అతని కన్నివిధాలా సాయంచేసిన భూపాల్‌కి రెండు సంవత్సరాలు జైలుశిక్ష అకారణంగా వసూలు చేసిన లక్షరూపాయలూ ఇన్సూరెన్స్ కంపెనీకి చెల్లించాలి."

తీర్పు విన్న భానుప్రభ కళ్ళంబడి నీళ్ళు తిరిగాయి. భూపాల్ ముఖం వెలవెల పోయింది.

"జైలునించి పారిపోవడం నేరం కనుక పారిపోయినరోజుల్లో సగం ఉత్తమచంద్ర కూడా జైలుశిక్ష అనుభవించాలి" ఆ తీర్పుకి కించిత్తుకూడా బాధపడలేదు ఉత్తమచంద్ర.

కళ్యాణచక్రవర్తి అతని భుజం తడుతూ "నీ వింక నిశ్చింతగా వుండు ఉత్తమ్। నువ్వు జైలునించి పారిపోవడం చట్టరీత్యా నేరమే। ఆ నేరానికి చిన్న శిక్ష అనుభవించు. పైగా ఒక విధంగా భూపాల్—వరప్రసాద్‌లనించి రక్షణ అది. నువ్వు ఇప్పుడే విడుదలైతే వాళ్ళు కోపంతో రహస్యంగా మనుషులనిపెట్టి నిన్ను చంపించవచ్చు. అది అరికట్టడంకోసం భగవంతుడీ విధంగా కొన్నాళ్ళు రక్షణ కల్పించాడనుకో."

తమ పక్షాన కృషిచేసిన చక్రవర్తికి—తమకి నిజం చెప్పి, ఆపదలపాలయిన ఉత్తమచంద్రకి—ఇన్సూరెన్సు కంపెనీవారు మంచి బహుమానాలే ఇచ్చారు.

సెంట్రల్ జైలుకు వెళ్ళబోతున్న భూపాల్‌ని కలుసుకుంది భానుప్రభ.

వణికే చేతులతో అతని చేతికి ఒక కవరు అందించింది. అది అందుకున్నాడు భూపాల్! రెండు చేతులు జోడించింది.

సూర్యమిత్రని చూసి "మిస్ సూర్యమిత్రా! నువ్వు లాయర్ ద్వారా పంపిన నోటీసు అందింది. దానికి జవాబు నేను జైలునించి పంపిస్తాను" అన్నాడు.

"అలాగే" నన్నట్టు తల వూపింది.

"మిస్టర్ కళ్యాణచక్రవర్తిగారూ! మా ఆఫీసులన్నీ క్లోజ్ చేయమంటారా?" అని అడిగాడు భూపాల్.

"అవసరంలేదు. నమ్మకం అయిన పనివారితో నడిపించవచ్చు. నేను వెళ్ళి తనిఖీ చేస్తుంటాను" అన్నాడు.

ఆ మాటకి కృతజ్ఞతగా చూశాడు భూపాల్.

"మా నాన్నగారు—నేను జైలునించి వచ్చేవరకూ మీకు అథారిటీ లెటర్ యిస్తాను. చెక్‌పుస్తకం యిస్తే సంతకాలు చేస్తాను. ప్రతినెలా యివ్వవలసిన జీతాలు చెల్లించవచ్చు."

"అలాగే! ఒక్క విషయం మీకు శాంతంగా ఆలోచించమని చెబుతున్నాను—ఉత్తమచంద్ర యెంత నిజాయితీపరుడో మీ మనస్సుకు తెలుసు. అతనీ చిన్నశిక్ష అనుభవించాక తిరిగి మద్రాసులోనో హైద్రాబాద్‌లోనో మేనేజర్‌గా పెట్టుకుంటే మీకు విశ్వాసంగా పని చేస్తాడు" అన్నాడు చక్రవర్తి.

"ఆ విషయం ఆలోచించి చెబుతాను" అంటూ భూపాల్ కటకటాల మధ్యకి వెళ్ళిపోయాడు.

జైల్లో కూర్చున్నాక భానుప్రభ రాసిన కవరు విప్పదీశాడు.

"శ్రీ భూపాల్‌గారికి,

కాళ్ళు పట్టుకుని నెడితే చూరు పట్టుకుని వేలాడినట్టు నే నన్నివిధాలా పరిష్కరించి తెగతెంపులు చేసుకుంటే ఇంకా ఈ ఉత్తరాలు రాసి విసిగిస్తావు దేనికి? అని విసుక్కోకుండా

చదవండి. మీకు నేనంటే అనురాగం లేదు. అంతవరకూ నేను చెప్పగలను. అదే వుంటే నన్నింత తేలిగ్గా భావించ లేరు. మీకు నాపై ఏపాటి అనురాగంలేకపోయినా మీ బదులు నా బదులు నాకే పోశాడా దేవుడు. అందుకనే మిమ్మల్ని ఎంతకీ మరచిపోలేకపోతున్నాను. చెల్లి సూర్యమిత్ర ఉత్తమ చంద్ర ప్రోత్సహించకపోతే మీకు ముఖాముఖీ కోర్టులో తారస పడేదాన్ని కాదు! మీ భోగభాగ్యాల నాశించి వుంటే ఆ నాడే బ్లాక్ మెయిల్ చేసి ఆ హైద్రాబాదులోనే తిష్ఠ వేసేదాన్ని, కేవలం బాబుని చూపి అయినా మీ మనస్సు కరగకపోతుం దన్న ఆశతో నేను చేసిన ప్రయత్నంలో నేను గెలిచినా మానసికంగా ఓడిపోయాను. మీ డబ్బు నా కవసరంలేదు— దానికోసం నేను ఏనాడూ ప్రయత్నించి మీ మీద కేసు బనా యించలేదు. అందుకే మీ రిచ్చిన లక్షరూపాయల చెక్కు ఈ దీంట్లో పంపిస్తున్నాను. ఉత్తమచంద్ర కేసులో ఓడిపోతారు. జైలుశిక్ష అనుభవించక తప్పదని లాయరుగారన్నారు. మీరు జైలునించి తిరిగి వచ్చేవరకూ వేయి కళ్ళతో ఎదురుచూస్తుం టాను. అప్పటికైనా మీలో పరివర్తన కలిగి నన్ను స్వీకరించ మని ప్రార్థిస్తూ—

ఇట్లు

భానుప్రభ."

ఆ ఉత్తరం చదివి మనస్సంతా వ్యాకులపాటు చెందగా భాను ప్రభ పంపిన చెక్కు కేసి తదేకంగా చూడసాగాడు. ఆ నాలుగు గోడల మధ్య ఆ చెక్కును చూస్తూంటే అతనికేదో జ్ఞానోదయం కలుగు తున్నట్లయింది.

ప్రపంచంలో డబ్బు లేకపోతే ఏదీ అర సెంటిమీటరు కూడా జరుగదు. నిజమే! కాని ఆ భోగభాగ్యాలకి—ధన సంపదలకి— లొంగని మహానుభావులు కూడా వుంటారని ఈ ఉత్తరమే చెబు తోంది. ఈ చెక్కు చెబుతోంది. ప్రపంచంలో ఏదైనా డబ్బుతో కొన

గలం అని విర్రవీగిన తన అహంభావం మీద ఓ గొడ్డలిపెట్టు ఈ తిరిగివచ్చిన చెక్కు.

ఏమయినా కొనగలదేమోగాని—ఉత్తమ్‌లాంటి నిజాయితీపరుడిని—భానులాంటి ప్రేమమూర్తిని—సూర్యమిత్రలాంటి అగ్నిశిఖను కొనలేడని స్పష్టం అయింది. నీతికీ నిజాయితీకి పాటుపడే ఉత్తమ్! అమాయకులని తనలాంటి కబంధుల హస్తాల్లోంచి కాపాడి ధర్మాన్ని పరిరక్షించాలనుకునే లాయరు కళ్యాణ చక్రవర్తిలాంటి మహాత్ములు ఉన్నంత కాలం, ఈ కలికాలంలో కూడా ధర్మ సంస్థాపన జరుగుతూనే వుంటుంది. ఎన్నడూ కదలని కఠిన శిలవంటి భూపాల్ హృదయంలో పెద్ద ఆటంబాంబు పడి ఆ శిల ఛిన్నాభిన్నం అయి స్వచ్ఛమైన మనస్సు బయటపడసాగింది. భానుప్రభ ఉత్తరం పక్కనపెట్టి సూర్యమిత్ర లాయరుద్వారా పంపిన నోటీసుకు జవాబు వ్రాయడం ప్రారంభించాడు.

"సూర్యమిత్రా! నేను దుర్మార్గుడినే కావచ్చు. ఆడపిల్లలను పూవులా నలిపే అమానుషవంతుడినే కావచ్చు. అలాగే నువ్వు రాలేని, రెండురోజులు తిండిపెట్టక మాడ్చిన మాట వాస్తవమేగాని—ఆ రోజురాత్రి నిన్ను నేనేం చేయలేదని ప్రమాణంచేసి చెబుతాను—నమ్ముతావా! నిన్ను అనుభవించాలనే గదికి తెచ్చా. కాని తిండీ తిప్పలూ లేక లంఖణాల మనిషిలా వేలాడిపోతున్న నిన్ను ఆ మగతలో అనుభవించాలనిపించలేదు—నిద్రమాత్ర లిచ్చి పొందడం, అదో పెద్ద మగతనం కాదనిపించింది. ఆఖరుక్షణంలో నాలో అన్నీ యిలాంటి భావనలే రేగి విడిగా పడుకున్నాను. నిన్ను అప్పటికి పంపేశాను. ఆ తర్వాత నువ్వు—నేను మళ్ళీ తారసపడలేదు. కోర్టు కీడ్చినా నే నింతకంటే జవాబివ్వలేను.

'భూపాల్.'

ఆ ఉత్తరం అందుకున్న సూర్యమిత్ర నిర్ఘాంతపోయింది. అందులో నిజానిజాలను తర్కించుకుంటూ చాలాసేపు ఉండిపోయింది. చివరకి కళ్యాణచక్రవర్తి దగ్గరకు వెళ్ళి ఆ ఉత్తరం చూపించింది.

అది రెండు మూడుసార్లు చదివాక సూర్యమిత్రవి చూసి—

"ఇది నిజమే అయివుంటుంది సూర్యమిత్రా—! నీ కతని మీద అనుమానంగా వుంటే ఆ తెల్లారే లేడీ డాక్టరుచేత పరీక్ష చేయించుకోవాలి. ఆవిడ రిపోర్టుంటే తప్ప అతను రేప్ చేశాడని ఏ విధంగా ఋజువు చేస్తావు? తగిన సాక్ష్యాధారాలేవి? కనుక మౌనంగా అతను రాసింది నమ్మడం మంచిది. ఇది అబద్ధం కాదనే అనిపిస్తోంది."

సూర్యమిత్ర ఆలోచించగా అంతకంటే వేరే మార్గం కనిపించలేదు. దొంగలు పడిన ఆరునెలలకి కుక్కలు మొరిగాయన్నట్టు తనిప్పుడు యేమని కేసు బనాయిస్తుంది?

"అంతే అయివుండవచ్చు. అలాంటి మగవాళ్ళు అహంభావం కొద్దీ నిద్రమాత్రలతో అనుభవించడం గొప్పకాదని తమని తామే కంట్రోల్ చేసుకోవచ్చు" అంటూ లేచి నిలబడింది.

"జరిగినవన్నీ ఓ పీడకలలా మర్చిపో సూర్యమిత్రా! ఉత్తమచంద్ర తిరిగి రాగానే మీ యిద్దరూ పెళ్ళిచేసుకోండి!" అన్నాడు కళ్యాణచక్రవర్తి.

ఆ మాటకి సిగ్గుతో మొగ్గలా ముడుచుకుపోయింది సూర్యమిత్ర. అలాగే నన్నట్టు తల వూపి "పాపం మా అక్కయ్య జీవితమే—ఆవిడ ఆశించింది జరగక దిగులుపడింది చివరకి" అంది సూర్యమిత్ర.

"అంతా చక్కబడుతుంది. మీరు వివాహం చేసుకోండి" అన్నాడు లాయరు.

సూర్యమిత్ర వెళ్ళిపోయింది.

# 14

"సుఖస్యానంతర దుఃఖం—దుఃఖస్యానంతరం సుఖం" అన్నట్టు కష్టాల్లో కాలికాలిన మనుష్యుల జీవితాల్లో ఏదోనాడు చల్లని దేవత మృదహస్తం వెన్ను నిమరకపోదు. కన్నీటి ధారలు పన్నీటి జల్లులు కాకపోవు. రాత్రి వెనక పగలు రాకపోదు. ఉత్తమచంద్ర

ఆ నాడే జైలునించి విడుదలై సరాసరి విజయవాడ వచ్చాడు. అతను వచ్చేసరికి గుమ్మాలు కడిగి—పసుపు—కుంకుమ పెడుతోంది సూర్య మిత్ర.

జోళ్ళ శబ్దం విని, ఆ పసుపుగిన్నె అక్కడే పడేసి ఒక్క అంగలో ఉత్తమచంద్రని పెనవేసుకుంది. హృదయమంతా అను రాగం పొంగిపొరలగా ఆమెని ఆర్తిగా గుండెలకు హత్తుకున్నాడు ఉత్తమచంద్ర.

అంతవరకూ, వొకరి మనసులో వొకరు తిష్టవేసుకున్నా అది పైకి ప్రకటించుకోలేక తమ మమతా వెల్లువలను తమలో ఇముడ్చుకుంటూ వచ్చిన ఆ జంట హృదయాలా క్షణంలో వొకరి హృదయం మరొకరికి అర్థమయి ఆనందోద్వేగంతో ఆపాదమస్తకం వూగిపోయాయి.

ఒకరి కౌగిలిలో ఒకరు పరవశించిపోయారు.

"సూర్యా! నీ కోసం పరుగున వచ్చాను" అన్నాడు ముద్దు పెట్టుకుంటూ.

"మీకోసం వేయి కళ్ళతో యెదురు చూస్తున్నాను" అంది పులకరింతగా. మెల్లగా విడిపించుకుని అతన్ని లోపలికి తీసుకు వెళ్ళింది.

గబగబా కాఫీ కలిపింది. అతనికిచ్చి అతని చెంతనే కూర్చుని తనూ త్రాగింది. అలా బాబుని తీసుకుని బజారుకు వెళ్ళిన భానుప్రభ తిరిగివచ్చి ఉత్తమచంద్రని చూపి సంతోషించింది.

ఆ వారంలోనే లాయరు కళ్యాణచక్రవర్తి—అతని భార్య పద్మప్రియ—ఉత్తమచంద్ర పెద్దమ్మ మీనాక్షమ్మల సమక్షంలో ఉత్తమచంద్ర — సూర్యమిత్రల వివాహం సింపుల్‌గా జరిగి పోయింది.

"మీ దంపతులిద్దరూ మద్రాసు సెంట్రల్ జైల్లో ఉన్న భూపాల్‌గారికి కనబడి రండి" అన్నాడు కళ్యాణ చక్రవర్తి.

ఏ కారణం లేందే అలా చెప్పడని గ్రహించిన ఉత్తమ్,



జ్యోతి



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M113 |
| పుస్తకం పేరు | జ్యోతి |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 119 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Susmitha |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | ch. Ramya |
| పరీక్ష చేసినది | PRATHYUSHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |